# కొడంగలు
# వేంకటేశ్వర శతకము

రచన

చౌడూరి గోపాలరావు

ప్రచురణ :

బాలాజీ ప్రచురణలు

కొడంగలు

# కోదంగలు
# వేంకటేశ్వర శతకము

రచన: చౌడూరి గోపాలరావు

ప్రతులు :
1000

వెల
రెండు రూపాయలు

ప్రతులకు :
శ్రీమహాలక్ష్మి వేంకటేశ్వరస్వామి దేవస్థానం
బాలాజినగర్, కోదంగలు.



దేవాలయ శిఖరాలు

# పరిచయం

నా బాల్యమిత్రుడు విద్యాశాఖలో తాలూకా పర్యవేక్షకులుగా పనిచేస్తున్న శ్రీ బస్వణప్పగారి ద్వారా శ్రీనందారం నరసింహులుగారి పరిచయమైంది. మా గురువర్యులు శ్రీ దామోదర్‌రావు గారి ద్వారా నరసింహులు గారి జీవిత చరిత్రవిన్నాను వారిచే నిర్మితమైన దేవాలయాన్నిచూచాను

కొడంగలొక దివ్యక్షేత్రంగా మారింది దేవాలయాలుకట్టడం గొప్పగాదు దానిసక్రమ నిర్వహణలో ఉందిగొప్పతనమంతా కొడంగల్ దేవాలయం హిందూ ధర్మస్ఫూర్తి కేంద్రంగా పనిచేస్తుంది రాజకీయ ప్రాబల్యాలకు కాని కీర్తి కక్కుర్తికై గాని ధర్మప్రచార రాహిత్యానికిగాని ఈ క్షేత్రనిర్మాణం జరగలేదనేది చూచినవారికి తెలుస్తుంది ఇది కేవలం భక్తితో నిర్మితమైనదేవాలయం,

లక్ష్మివెంకటేశ్వరుని చూడగానె శతకం వ్రాయాలనిపించింది వ్రాశాను. శ్రమఅనక శ్రీ నరసింహులుగారు దాని ముద్రణకంగీకరించిరి ఈ ప్రచురణకు చాలామంది తోడ్పడ్డారు వీరందరికి కృతజ్ఞతలు

చక్కని సలహ లందించారు తెనాలి సాహితీ సంస్థ కార్యదర్శులు శ్రీ గోపాలకృష్ణగారు.

కోరగానె కావ్యాన్ని పరిశీలించి తొలిపలుకులు వ్రాసిఇచ్చారు. శ్రీగంగాపురం హనుమఛ్ఛర్మగారు, శ్రీ సత్యనారాయణగారు, శ్రీ దామోదర్‌రావు (జజి) గారు, శ్రీ ముడుంబ వరదాచార్యులు గారు, తదితరులు

సకాలంలో చక్కగా అచ్చువేశారు, శ్రీనివాస ప్రింటర్సు మహబూబ్ నగరం వారు

దోషాలు లేవనికాదు సహృదయులు గుణదోషాలు గమనించి గుణాన్నే స్వీకరిస్తారని ఆశిస్తాను.

శ్రీ నందారం నరసింహులు గారికి, వారి కుటుంబమునకు శ్రీలక్ష్మి వెంకటేశ్వరుడు అమందానంద సుఖాలంద జేయుగాక.

ఇట్లు

రచయిత

# అభిప్రాయము

ఇది కోడంగలు గ్రామమునకు వేంచేసిన కలియుగ ప్రత్యక్ష దైవము శ్రీ లక్ష్మీవేంకటేశ్వరుని యొక్క శతకము ఈ వేంకటేశ్వరాలయమును నిర్మించి స్వామివారిని ఇచ్చట స్థాపింప జేసినవారు పరమ భక్తులగు శ్రీమిడిదొడ్డి సంవారము నరసింహులు గారు. సంపద పెరిగిన కొలది శ్రీలక్ష్మి వేంకటేశ్వర స్వామి యెడల భక్తి పెరుగుచు, పెరుగుచు కొడంగల్ గ్రామమున శ్రీవారి ప్రతిష్ఠాపనకు కారణమైనది. వీరలు ఇచ్చట దర్శనం పొంది తన భక్తిని పెంపొందించు కొనుటకు వీలైనది

వీరికి నలుగురు కుమారులు, ఇద్దరుకుమార్తెలు పెద్ద కుమారుడు వెంకటయ్యగారు రాజకీయ దురంధరులు ప్రస్తుత శాసన సభ్యులు రెండవవారు శ్రీ గంగయ్యగారు, వీరు చాలా నిర్మల హృదయులు భక్తిభావము గలిగిన దైవోపాసకులు వ్యాపారంలో నేర్పరి మృదుస్వభావులు మూడవ వారు శ్రీకృష్ణయ్యగారు వీరు వ్యాపార వాణిజ్య నిపుణులు నాల్గవవారు శ్రీ లక్ష్మి నారాయణగారువీరు మొన్నటివరకు విద్యార్జనచేయుచుండెడివారు, వీరిప్పుడే వ్యాపార క్షేత్రములో ప్రవేశించినారు. చాలా జాగ్రత్తగల వ్యక్తి స్నేహమునకు తగినవారు

శ్రీ నరసింహులుగారు తమ బాధ్యతలను కుమారులకప్పగించి తాముమాత్రము శ్రీలక్ష్మివెంకటేశాలయాసక్తులై పరమ భక్తి సంపన్నులై జీవిస్తున్నారు శ్రీనరసింహులుగారు చిన్ననాటినుండి నేటివరకు స్నేహితులు ఇంతటి భక్తాగ్రేసరుడు నా స్నేహితుడని నేను గర్వపడుచున్నాను

శ్రీ లక్ష్మి వెంకటేశ్వరస్వామియొక్క శతకమిది దీనిని చౌదూరి గోపాలరావు మంచి శైలిలో వ్రాసినందుకు నేను మిగులసంతోషించుచున్నాను వీరు నా శిష్యులలో నొకరు ముమ్ముందు వారిలేఖినినుండి అనేక కవితా ఖండికలు రావాలని ఆశిస్తు ఆశీర్వదిస్తున్నాను

ఇట్లు

దామోదర్ (జకి)

కోడంగలు

# నా దృష్టిలో

వ్రాసి తట్టుకునే శక్తి కవికుంటేనే వ్రాయగలడు నేడు కలమెత్తితే కవిత హాల మెత్తితే పంట అను ధర్మమునకు కట్టుబడ్డ మనదేశంలో కవితవ్రాయుట చిన్నమాట గాదు, అన్నింటికివలెనే కవితకు కొన్ని లక్షణాలున్నవి అవేవైనను ఆనందం కూరియుప్రయోజనమని నమ్మెదాము కావ్యం చిన్నదైన పెద్దదైనా గుణంప్రధానం చదివే గుణాలుంటే కావ్యంలో గుణమున్నట్లు కావ్యం వ్రాసిన వానిసొత్తా సహృదయుల సొత్తన్నది నిర్వివాదాంశం దాని బాగోగులు కాలం సంఘం నిర్ణయిస్తుంది ఆ ధర్మమెట్లున్న అర్థం గుణమెట్లున్న గణం మొదటి స్థానాన్ని అక్రమించిన ఈకాలంలో కావ్యం వాటి రచన అవసరమే కాని ఎట్టి కావ్యాలన్నది వివాదాంశం

కాంతా సమ్మిదమైనను, మిత్రసమ్మిద మైనను రాసేకంటే సూటిగా చెప్పగల మార్గం చాలాసుగమం! ఏ కథాంశమొ గ్రహించి ఆ కథా వస్తువును విస్తరించు దాని కంతర్భాగంగా ఒకనీతిని పొదిగి చెప్పిన శబ్దలయాత్మకంగా మనోవృత్తుల కానందంగా ఉండి ప్రయోజనాన్నందించే దానిని వినటానికి నేటి భావుకుడికి నిలకడ శూన్యమేమో అనిపిస్తుంది కనుకనే లఘుకావ్య సారాలు కరపత్రాలు, ఆచారం, నేటికవులంతా ఖండకావ్యాలురాసి కవులనిపించుకోవడం ఏమిశ్మాలువలో సులోచనాలో కప్పుకోవడం పరిపాటైంది

పెట్టక కీర్తి లేదు వెరపింపక బుద్ధిరాదు తాతిట్టక వాదులేదు,అన్న శతక కర్త సూటిమార్గానికే నేడు విలువ అందుకే శతకాలు వాటిరచనకావాలి శతకాలకు సూటిగా చెప్పగల తాహత్తున్నది వేణుగోపాలశతక కారుణ్ణి తడిమితే నేటి ప్రజాస్వామిక యదార్థదృశ్యా లెన్నో విధంబులగు, మంగలెంకడే మనకంటికి కనుపిస్తవి

కవికి ఏదైనాకథావస్తువు కావాలి తనభావ్యమాన ప్రపంచాన్ని సమాజాని కందించడానికి దానికై యేరాముడో, ఏనరసింహుడో, వెంకటేశ్వరుడో ఏచెట్టో పుట్టో యేదైతేం ఎవరైతేం ఒక కథావస్తువు వేంకటేశ్వరుడంటే అడవులు అచలాలు అర్చకులు ఉండడం సహజం,పాలెం జడ్చర్ల వలెనే కొడంగల్‌లో వేంకటేశ్వరుడు వెలయడం అతడి బ్రహ్మోత్సవ, మాసోత్సవ పక్షోత్సవ

నిత్యోత్సవాలు జరుగడం జరిపించడం దానికొక భక్తుడు స్థలపురాణం ఇత్యాదులు లోకధర్మం

చౌడూరి యువకుడు ప్రతిభాశాలి కవికి ఆదేవునిపై మోజుకలిగి వ్రాసిన శతకం కొద్దిగా వ్రాతలో సంయమనం పాటిస్తె ఇంతకంటే ప్రయోజనకరమైన కవిత ఇతనిలేఖినిలో వెలువడే సూచనలున్నవి

కలిగిన భావుకానందాన్ని పంచి పెట్టడానికి కొడంగల్ వెంకటేశ్వరుడొక ప్రాతిపదిక నేటి బీభత్సాలు ఆసురసంపత్తు ఉన్నట్టు చెప్పగల ప్రతిభ ఇతనిది ఈతని మాటలలో ఇతని కవిత గిరులెగ్రాకి మేఘములగెల్చి వనావళిదాటి పంక్తిలో తిరగము నిలుచున్నది భావనాబలం ఉత్తుంగ శిఖరములధిరోహించు కవితాధార ఇతనిది

గుండూరు
కల్వకుర్తి తాలూకా

పశ్చేమ శరదశ్శతా,
గంగాపురం హనుమచ్ఛర్మ



శ్రీ మద్వేంకటేశాయనమః

# రెండు మాటలు

"కలౌ వేంకటనాయకః" అన్నారు పెద్దలు. కలియుగంలో అవతరించిన పరదైవతం శ్రీ వేంకటేశ్వరుడనియే పై వాక్యాని కర్థం ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్ముడు చెప్పిన తీరుగా వివిధయుగాలలో, వివిధజగాలలో, వివిధావతారముల ధరించి, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసిన శ్రీమన్నారాయణుడు నేటి కలియుగంలో వేంకటపతిగా అవతరించాడు

"అలవైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాన్తోపలో
త్పల పర్యంకరమా వినోదియైన" ఆ ఆపన్న ప్రసన్నుడు

ఆదినారాయణుడు నేడు సప్త శైలములపై వెలసిన తిరుపతి క్షేత్రమందు నివసించి ఉన్నాడు అమహామహుని దివ్య చరణారవిందములకు నిలయమైన ఆ ప్రాంతం కలియుగ వైకుంఠంగా ఘనతకెక్కింది "ఆనందనిలయంలో" మహానందమూర్తియై విలసిల్లే ఆ పరంధాముడు' యాతాయాత భక్తకోటుల మ్రొక్కుల తీర్చుచు, వడ్డికాసులవాడై ప్రఖ్యాతి గాంచాడు

ఆసేతు శీతాచల పర్యంతం భారతదేశంలో నివసించే యావత్ప్రజానీకానికి ఆయన కులదైవం అపరాత్పరుని దివ్యదర్శన భాగ్యం కోసం ప్రతిదినం వేనకువేలు ప్రజలు బారులుదీరి నిలుచుంటారు, అదే- అ దేవదేవుని మహిమకు ప్రబల తార్కాణం

కలియుగావతార పరదైవతంగా భావింపబడుతూ ఉన్న ఆ 'బాలాజీ' కేవలం తిరుపతి క్షేత్రమొక్కటే తననివాసానికి ఉచితమైన ప్రాంతంగా ఎన్నుకోలేదు ఎక్కడెక్కడ తన భక్తులు విరివిగా ఉంటున్నారో, అక్కడక్కడకు తనకుతానై వచ్చి, వెలసి, ఆప్రాంతాన్ని పవిత్రంచేసి, భక్తులపాలిటి కల్ప ద్రుమంగా పరిగణింప బడుతూ భక్తులసేవలను కృపాదృష్టితో స్వీకరిస్తున్నాడు

ఆ మహనీయ భాగ్యం మా కొడంగల్ గ్రామానికికూడ కల్గింది తిరుమల తిరుపతి కొండలపై అలువేలుమంగ, బీబినాంచారులతోఁగూడి విలసిల్లే ఆ పరంధాముడు, "శ్రీసందారం మిడిదొడ్డి నరసింహులు" అనే వణిక్ ప్రముఖులకు కలలో కన్పించి "నేను కొడంగల్‌కి రాదల్చుకున్నాను నాకు నివాసం ఏర్పాటు చెయ్యి" అని కోరాడట కాదు, కాదు ఆదేశించాడట! "ఎంతఅదృష్టం"!

ఎన్నో తపాలు, ఎన్నోజపాలు, ఎన్నోవ్రతాలు ఆచరించి విజితేంద్రియులుగా ప్రసిద్ధికెక్కిన మహాఋషులకే లభింపని ఆతని దివ్యసాక్షాత్కార భాగ్యం అప్రయత్నంగా శ్రీ నరసింహులు గారికి సిద్ధించింది. అంటే అది, ఆయనలోని ఉత్తమ దైవభక్తి పరాయణతకు ఒక అపురూపమైన నిదర్శనం

సంకల్పసిద్ధుడైన శ్రీ నరసింహులుగారు భగవదాదేశాన్ని కాదనక శిరోధార్యంగా భావించి, వ్యయ ప్రయాసాలకు లెక్కసేయక వైఖానస ఆగమోక్త ప్రకారంగా, వాస్తుశిల్ప శోభితమైన, దేవాలయాన్ని అరుమాసాల్లో నిర్మింపజేసి అందులో ఆ పరాత్పరుని దివ్య విగ్రహాన్ని ప్రతిష్టించారు. స్వామివారికి ఒక ప్రక్క, ఆదిలక్ష్మి అమ్మవారిని, మరియొక వైపున అలివేలుమంగ తాయారుని (విగ్రహాలను)గూడ వెలయింప జేశారు

తిరుమల తిరుపతిలో ఆ "ఆదిమూర్తికి" ఏవిధంగా సేవలు జరుగుతు ఉన్నాయో, అదేవిధంగా సేవలు జరుపటం కోసం వైఖానసాగమ పూజావిధానలో ఆరి తేరిన నల్వురు పూజారులను రప్పించి, అంగరంగ వైభవాలతో స్వామివారికి నిత్యం అర్చనలు చేయిస్తున్నారు.

ప్రతిదినం రెండుపేళ్ళలో స్వామివారితోబాటు భక్తజనులందరికి గూడ ఆరగింపు ప్రసాదం అందుతూనె ఉంటుంది భక్తుల గోవిందనామాలతో దేవాలయం మారుమోగ్రుతూనె ఉంటుంది. అక్కడ జరిగే ఏచిన్న కార్యక్రమమైన ఎంతో పొందికగా జరుగుతూ ఉంటుంది అది శ్రీనరసింహులు గారి కార్యదీక్షకు_దక్షతకు ప్రబలనిదర్శనంగా పరిఢవిల్లుతూ ఉంటుంది

ఉదయం 5 గం॥ కు (సుప్రభాత సమయంలో) మైక్‌లో సుప్రభాత కార్యక్రమంతో ప్రారంభమైన స్వామివారి ఆరాధన కార్యక్రమాలు రాత్రి 9 గంలకు జరిగే పవ్వళింపుసేవ పాటలతో పరిసమాప్తమౌతాయి కొడంగల్ గ్రామ నివాసులందరూ శ్రీనివాసుని సుప్రభాతంతో మేల్కొంచి ఆ పరాత్పరుని

పసళింపు సేవపాటలను వింటూ, నిద్రధిముఋల్పుతూ ఉంటారు అహో॥ఎంతటి మహత్తరమైన అదృష్టం కొడంగల్ గ్రామవాసులకు కల్గింది? అది వారేజన్మ లో చేసిన పుణ్యమో కదా!

నాకు నరసింహులు గారిని చూస్తే "ఆముక్తమాల్యద" లోని, ఆ విష్ణుచిత్తుడే గుర్తుకు వస్తాడు.

"ఆ నిష్ఠావిధి గేహసీమనడు రేయాలించినన్ మోమునెం
తే నాగేంద్రశయాను పుణ్య కధలున్"—అనే పద్యం నాచెవుల్లో మారు మ్రోగుతూ ఉంటుంది ఆ విష్ణుచిత్తునిలో కన్పించే సమస్త సద్గుణాలు నాకు వారిలో అవగతమౌతూ ఉంటాయి ఉదయం మొదలు సాయంకాలము వరకూ ఆలయ ప్రాంగణంలోనే తిరుగుతూ, బద్ధాంజలి పుటంతో, నగుమోముతో, సాదర మేదర వచనాలతో చిన్న పిల్లవాడినైనా పిలిచి సంభాంచిషి సంభావించి పంపె వారి ఉదారభావం, ఆదర్శతత్త్వం, పరెవ్వరిలోను నాకు కనిపించదు ఇలాగని చెపితే ఇది అతిశయోక్తి ఎంతమాత్రం గాదు.

ఈనాటికీ ఈప్రాంతంలో ఉన్న ఎధార్మికసంస్థయైనాసరే వారివిరాళంతో ప్రారంభం కావలసిందే ఇది జగమెరిగిన సత్యం

మరొ విశేషం :_తండ్రిగారి అడుగుజాడలలో నడుస్తు తండ్రిగారు చేస్తూన్న ప్రతి ధర్మకార్యానికి పత్తాసు పలుకుతూ "సంతత శ్రీ నారాయణపాద పద్మయుగళీ సంధానితానూన చెతస్కులై కనిపించే గంగయ్యశ్రేష్టిగారు మరొక క్రొత్త విశేషంగా నాకు కనిపిస్తారు. ఊరక చేసే ప్రసంగాలలో నైనా వారు ఐహిక విషయాలను స్మరింపరు కదా? ఎల్ల వేళ్ళలా భగవద్విషయాలోచనలేగదా ఎప్పుడూ భగవదారాధనా యత్త చిత్తులేగదా! ఆహా! ఆయన తండ్రిని మించిన తనయుడు

కేవలం గంగయ గారేకాదు,___ వారి కుటుంబమేఅంత, పెద్దకుమారుడు శ్రీ వెంకటయ్య M L A.గారు ప్రజలక్షుధార్తిని తీర్చుటకు బద్ధకంకణులయా అవిభక్తకుటుంబంగాఉన్న అనల్పురు అన్నదమ్ములు, దైవభక్తి పరాయణులై, ప్రజాసేవపరతంత్రులై తండ్రి అడుగు జాడల్లోనడుస్తూ, తరతరాలకు తరిగిపో సుస్థిరమైనకీర్తిని సముపార్జిస్తున్నారు

ఇక ప్రస్తుత విషయం:—

శ్రీ చౌడూరి గోపాలరావు గారు స్వామివారికి కైంకర్యంగా "శ్రీలక్ష్మి వెంకటేశ్వర శతకాన్ని" రచించి సమర్పిస్తున్నారని, ఆ భాగవత గ్రంథానికి మీరు "రెండు మాటలు" వ్రాయాలని శ్రీనరసింహులుగారు నన్నుకోరారు ఈ ఈ మహద్భాగ్యం దైవప్రేరణ వల్లనే నాకులభించినట్లు భావిస్తున్నాను "నా పుట్టు కృతార్థతం బొరసె" ధన్యోస్మి॥

శ్రీచౌడూరి గోపాలరావుగారు సుప్రసిద్ధులు. పాలమూరు జిల్లారచయితల సంఘనిర్వాకులుగా వారు యావదాంధ్ర దేశానికి సుపరిచితులే సంస్కృతాంధ్ర భాషలలోవారికి చక్కనిప్రవేశం ఉంది. నవీన భావకవితా తరంగాలు వారి హృదయ సాగరంలో ఉవ్వెత్తుగాలేస్తుఉంటాయి శ్రీగోపాలరావుగారు ప్రాచీన కవితా తత్వాన్ని ప్రామాణికదృష్టితో పరిశీలించి అర్థం చేసుకొన్నదిట అందుకే కాబోలు భగవదర్పితంగా సమకూరుస్తున్న ఈగ్రంధములో ఛందొ బద్ధమైన పద్యాలనే ఎన్నుకున్నారు సరళరచనా సంప్రదాయానికి చెందిన దవటం వల్ల 'పోతనభాగవతం' ఆంధ్రులందరికి ఎట్లు ప్రీతి పాత్ర మైందో, అట్లె ఈశతకం కూడా ఆంధ్రులందరియాదరానికి పాత్రం అవుతుందనటంలో సందేహం లేదు

ఎడ నెడలోకపు తీరులతోను, వేదాంత తత్త్వ నిరూపణములతోను, భగవదారాధనా పద్ధతులతోను వీరిశతకమును రచించి భగవదర్పితం గావించారు ఇందులో కేవలం భగవన్నుతులు మాత్రమేగాక, ఆలయ ధర్మకర్తల జీవిత చరిత్ర, ఆలయనిర్మాణం, క్షేత్రమహాత్స్యం మున్నగు విషయాలెన్నో ఉన్నాయి

భగవద్భక్తి యనే నందనోద్యాన వనంలో అరవిరసిన పారిజాతపుష్పం ఈ శతకం నవ్యభవ్య భావసురభిళ మధుర మందార మాలో సదృశమీశతకం ఈ శతకాన్న రచించిన రచయితలు ధన్యులు.''పరత్ర హేతో రిహజన్మనాచ'' అనే పండితవాక్యం వీరిపట్ల సార్ధకమైంది

అదివ్యమంగళ విగ్రహాన్ని, (శ్రీనివాసుని) పాదాలవద్ద పూజాపుష్పంగా ఉంచబడిన ఈశతకం త్వరలోనె మనకందరికి అందబోతోంది. పరమ భాగవత తత్త్వనిరూపణా పరాయణమైన ఈచిన్న గ్రంధం, ఆంధ్రులందరికే ఆరాదింప దగ్గ దగునని భక్తజనులందరూ భగవదర్పితమైన ఈ దివ్య ప్రసాదాన్ని గ్రహించి తరిస్తారని ఆశిస్తాను

ఇట్లు

CH సత్యనారాయణ·M O L

# ఒక మాట



శ్రీ చౌడూరి గోపాలరావుగారు రచించిన వేంకటేశ్వర శతకమును చూచి సంతసించితిని రచన భగవద్విషయము ఇందలి పదములు సులలితములు భావము సుబోధకము ప్రసాదగుణ ప్రసన్నమై చౌడూరి కవిత నైసర్గికముగా సుకవి పండిత సహృదయ హృదయంగమమై నిరాఘాటముగా సాగినదనుటలో నతిశయోక్తి లేదు మచ్చునకు

"తిరుమణిఁ దీర్చి, ముంగురులు దిద్ది కిరీటముఁ బెట్టి పట్టుటం
బరములు గట్టి చిత్రమగు బంగరు భూషణముల్ ధరించి నీ
కరమును రక్షగా నిలిపి గాతు నటంచ భయమ్మొసంగు, నో
తిరుమల నాథ!

అను పద్యమును తిలకించినచో సుస్పష్టము నేటి సమాజపు ధోరణిని జూపుచు సమాజమును ధర్మపథమునకు మరల్చునట్టి పద్యములెన్నో గలవు

'పాలకులయినవారి పరిపాలనలోన మతంబు లేదు ఈ
కాలము వారికే మతము, కాంక్షలఁ దీర్చు రాజకీయమే మేలని

అని స్వాభిప్రాయ నివేదనములో జంకు గొంకులు లేకుండ సంఘములోని కుళ్ళును కుత్సితమును బయటబెట్టి సంఘమునకు చక్కని సందేశము నిచ్చినాడు ఒక దశాబ్దమున నీకవి స్వీయ నిత్య సుందర కవితానందము నుండి, విభిన్న వివిధ సాహిత్య సుమములఁ నందజేయుచున్నది సాహిత్య బంధువుల కందరికి సువిదితము,

ఇందులో నచ్చటచ్చట కవియావేశముచే "నవీనయిజాల మజాలముధ్య" వంటి సమాసములచే త్రివేణి సంగమములు గావించినట్లు గాననగును సర్వత్ర భక్తి సంప్రదాయ సంపన్నత, కవితావేశము, లోకజ్ఞత, గోచరించును "భవమను వార్ధిలో మునిగి బంధితు నైతిని మోహమందు సంభవమగుచుండె వార్ధకము, పాపములే బడబానలమ్ములై ——" అనుటచే కవి వేదాంతియై

సంసారబంధమోచనము నాకాంక్షించుట, ప్రపంచ పరమార్థమును లోకమునకు విశదపరచుటయై యున్నది కవికిగల శ్రీవేంకటేశ్వర భక్తియే యీ శతక రచనకు గారణమయినది వీరి కృషి పండిత ప్రశంసార్హమయినది వీరు ఇతోధికనూత్న రచనాసక్తులై సాహిత్య ప్రపంచమున సుప్రతిష్ఠితులగుదురు గాత యని యాశించు వాడ

ముదుంట వరదాచార్యులు, M O L
ప్రాచ్య భాషాకళాశాల ఉపన్యాసకులు కొడంగల్



" దేవుణ్ణి వెద డానికి వెక్కడికి పోతున్నావు? ఈ కోటాను కోట్ల ప్రజలు దేవుళ్ళుకారా? గంగానదీ తీరంలో బావి త్రవ్వదలుసున్నావా? ఈ ప్రజలను ప్రేమించు ఆరాధించు నిరుపేదల కష్టాలనుచూచి వలవల యేడ్చేవాడే మహాత్ముడు లేనిచో వాడు దురాత్ముడే

—స్వామి వివేకానంద



శ్రీ మహాలక్ష్మి



శ్రీ లక్ష్మి వెంకటేశ్వరాయ నమః

ఒకనాటి శుభోదయం, పూర్వాంగణం రాగరంజితమౌతూంది. మలయానిలుడు పురోపవీధులలో పిల్లగంతులు వేస్తూవిహరిస్తున్న మధుర సమయం. మధురమైన ఆనాటి ప్రత్యూషకాలంలో నగరమంతా మంగళ వాద్యధ్వని వ్యాపిస్తుంది, మైకుద్వారా సుప్రభాతము పౌరులకు శ్రవణానంద కరంగా ఉంది. వేదగాన నినాదాలు ఆనగరానికి వైతాళిక గీతికలైనాయి. వాతావరణమంతా ఆహ్లాదకరంగాఉంది

ఆనాడు జులై మొదటితేది నాబాల్యమీ నగరంలోనే గడచింది. చాలాదినాల తరువాత ఈనాడు రావలసి వచ్చింది. మామిత్రుడి వైపుచూస్తూ ఈ సుప్రభాతమేమిటి? ఈ మంగళవాద్యాలెక్కడివి? మనకాలంలో ఇంతశ్రద్ధతో పౌరులకి వైదిక మంత్ర ప్రసారం చేసే పిపాసువులే లేరుకదా! అనిఅడిగాను ఆశ్చర్యంగా

"నగరంలో శ్రీ వేంకటేశ్వరాలయం వెలసింది, ఈనాడు స్వామివారి ప్రతిష్ఠా కార్యక్రమం పదవెడదాం అన్నాడు" మిత్రుడు

సరేనంటూ స్నానాది కృత్యాలు తీర్చుకొని, మిత్రుడి వెంబడివెళ్ళా. దేవాలయం వర్ణనాతీతం, తిరుపతికి ప్రతిబింబంలా ఉంది అడవులు, అచలాలు, ఉంటేసాక్షాత్ తిరుపతే ఆంధ్రప్రదేశ్‌లోని పాలమూరుజిల్లా కొసనగల కోడంగలు అనబడే ఈమారుమూల గ్రామానికి, ఇంతవైభవోపేతంగా శ్రీనివాసుడు రావడం యెలా వొసగిందనే ప్రశ్ననాలో ప్రవేశించి నా మిత్రుడి వెంబడిఅలానే జనంలోకివెళ్ళా

జనం క్రిక్కిరిసి ఉన్నారు. గోవిందనామం మిన్ను ముడుతూంది. విగ్రహం తిరుపతి వెంకటరమణుని సరియెత్తులో ఉంది. ఈ శేషాచలవాసుడు, ఆపద్బాంధవుడు, కలియుగ దేవుడు ఈనాడు ఈ నగరంలో ప్రతిష్టితుడౌ తున్నాడు.

కొన్నిగంటలదాకా తిరిగి దేవాలయంచూచాను ఆజన సందోహంలో మా పూర్వ ఉపాధ్యాయుడు శ్రీ ధామోదరరావు పంత్‌గారు కలిశారు వారు కవులు, ఉరుదూ సాహిత్యమునందు పేరు గాంచినవారు నమస్కరించా

ఏంటోయ్? యెప్పుడొచ్చావు. క్షేమమా అన్నారువారు

నమస్కారములు, క్షేమమేనండి అంటూ ఈ దేవాలయాన్ని పొగుడటం ప్రారంభించాను నా ప్రశ్నకూడా చెప్పుకొన్నాను. నన్నుఅలా ఆరుబయల్లోకి తీసుకెళ్ళి ఈ మందిర నిర్మాణం దానికి కారణం, సవిస్తారంగా నేను కోరినట్లుగా చెప్పటం ప్రారంభించారు

సుమారు అరవై సంవత్సరాలకు పూర్వం పరిగి తాలూకాలో శివారెడ్డి పల్లిలో ఒకతల్లి పన్నెండు సంవత్సరాల కుమారునితో కాపురముంటుండేది యౌవ్వనంలోనే భర్తను కోల్పోయిన ఆయమ ఆగ్రామంలోని శ్రేష్టికులంవారి కుటుంబాలకు నీళ్ళుమోస్తు జీవించేది చాలీచాలని కాపురం దినం గడపడం కష్టంగా ఉండేది పేదతనం ఆతల్లీకొడుకుల మధ్యపెన వేసుకొని కూర్చుంది వీరుశ్రేష్టి కులజులు ఆగ్రామానికి వలసవచ్చారు. జీవనోపాధికై యెన్ని యాతనల ననుభవించినా స్వల్పాదాయం ఆమెను కడుదైన్యంగా బ్రతుకనిచ్చేది.

పరిచయస్తుడైన రెడ్డి ఆయనగా రాగ్రామంలో వ్యవసాయదారుడు నరసింహులుని చూచి "నాయనా! ఇంత వాడవు, నీ విలావ్యర్థంగా తినితిరుగు తూంటే మీ అమ్మ యెక్కడి నుంచి తెచ్చిపెడుతూంది నీళ్ళుమోసి ఆమెభుజాలు కాయలు కాసినై రేపు యింటికిరా పది రూపాయలిస్తా యేదైనా వ్యాపారం చెయ్యి" అన్నాడు దయతో

కర్తవ్య మంటే యేమిటో యెరగని ఆ బాలుడు నిశ్శబ్దంగా విన్నాడు ఈ మాటల్ని. కొందరి బాల్యం దయనీయంగా గడుస్తుంది. అల్లారుముద్దుగా పెరిగి వాయు తరంగాల వలే, అహ్లాదకరంగా గడపవలసిన శైశవ దశకు వారు నోచుకోరు దురదృష్ట కరాన యెనలేని బాధ్యతలు వారి నెత్తిన పడతాయి మరుసటి రోజు వెళ్ళి రెడ్డి దగ్గర పది రూపాయలు తీసు కొన్నాడు యేమిచేయాలో తోచ లేదు తిన్నగా బజారు గుండా నడుస్తున్నాడు. ఆగ్రామంలో తమకులం వారిలో పెద్ద షాహుకారు దుకాణం ముందుగా వెడుతున్నాడు ఆ దుకాణంలో మిరుపకాయలు చాలా కనిపించాయి గోనెసంచి తీసుకొని మిరపకాయచే కొందామను కొన్నాడు నరసింహులు కొనటం కూడా జరిగింది.

వంశ పారంపర్యతలో ఒకనాడు తన పూర్వులు కలవారే వారు వ్యాపార స్తులే ఆసహజాతం అతనిలో జాగృతమై కర్తవ్యమయుని చేయ గలిగింది శ్రమకు సిద్ధపడిన వాడు అవరోధాలని లెక్క చేయడు వారిదృష్టి భవిష్యత్తుపైనే మిరుప సంచితో కోడంగల్ సంత చేరుకొన్నాడు గుడ్డిలో మెల్ల అన్నట్టు కొంత లాభంకలిగింది

కోడంగలు ప్రతి సంతకి నరసింహులు వస్తూండేవాడు ఆసంత ప్రక్కనే ఒక దుకాణముండేది ఆ కొట్టుయజమాని తిప్పయ శ్రేష్టి, అతడూ మధ్య తరగతి వాడే నరసింహులు ఈ తిప్పయగారి దృష్టి నాకర్షించాడు. అతనికి ఒక కూతురుంది నరసింహులుకు ఇచ్చితన ఇంటి దీపం నిలుపుకోవాలను కొన్నాడు ఒకనాడు నరసింహులును పిలిచి ప్రస్తావన వశంగా తన ఇంట్లో ఉండ మన్నాడు.

స్వేచ్ఛా ప్రియుడైన ఈతడికి కొంత ఇరకాట పరిస్థితి యేర్పడింది తిప్పయ గారు మిడిదొడ్డి కులశ్రేష్టుడు, మర్యాదమనిషి, తనశ్రమను గమనించిన వాడు. గుండెలో యెదుటి వానిస్థాయి పెంచి నిలుపు కొన్నాడంటే, యెదురాడటం యెవని వల్లాగాదు నరసింహులు మౌనంగా నిలుచున్నాడు తిప్పయగారు మౌనాన్ని అర్ధాంగీ కారంగా గ్రహించి రేపు వచ్చేయ మన్నాడు.

క్రొత్త ఇల్లు, అంతా క్రొత్తవారు, తానుపరాన్న భుక్కుడుగా వారిపెట్టి పోతలకు ఉండవలసివచ్చింది వస్తుతః నరసింహులు స్వతంత్రం కోరువాడు చిన్ననాటినుండి స్వేచ్ఛగా తిరిగినవాడు. కొంతమనోవ్యధతో క్రియాకలాపాలు తగ్గించాడు ముల్లు అరటాకు సామెతగా ఉంటుంది పరాయిస్థలం

ఒకనాటి వేకువన తిప్పయశ్రేష్ఠి నరసింహులును పిలిచి, వ్యర్ధుడవని, కార్యసాధనకు పనికిరావని, మేసేవాడివేకాని, చేసేవాడివికావని, సోమరివని, కొంత ఆదరవు లభించగానె మహారాజు వైనావని మందలించి వెళ్ళిపొమ్మన్నాడు తన ఇంట్లోంచి

స్వాభిమానం గల ఆయువకుడు, ఆమాట వినగానే బయటపడ్డాడు. నేనా బ్రతుకలేనివాడిని, బ్రతికిచూపిస్తానని మనస్సులో శపథం చేసుకొన్నాడు. తిరిగి జీవితం యథాస్థాయికి చేరుకొంది అనేకగ్రామాలు తిరిగాడు, పలువురిని కలిశాడు, ప్రతిసంతకి వెళ్ళాడు, అనుభవం సంపాదించాడు యెంతకష్టపడినా గొఱ్ఱె తోకలాంటి ఆదాయంతో ఆతల్లికొడుకులు చాలా బాధపడేవారు ఒకపూట ఉండీ లేకనడిపించేవారు జీవన యాత్రని.

కొన్నిదినాలు సాగాయి, తిప్పయశ్రేష్ఠిలో పాశ్చాత్తాపం ప్రారంభమైంది పెరుగుతూన్న తన కూతురు కూడా ప్రశ్నార్ధకంగా ఆతనిముందు నిలిచింది తనలోని వృద్ధాప్యం పాశ్చాత్తాపానికి దారితీసింది. ఆతని మనో నేత్రమ్ముందు నరసింహులే మెరిశాడు శివారెడ్డిపల్లి వెళ్ళాడు తీసుకొనిరావడానికి.

విశాల హృదయుంగల నరసింహులు యెదురేగి తిప్పయశ్రేష్ఠికి స్వాగతం పలికి ఇంటికితీసు కెళ్ళాడు అతడు చెప్పేవన్నీ విన్నాడు, అంగీకరించాడు తల్లితో సహా కోడంగలు జేరుకొన్నాడు తిప్పయశ్రేష్ఠి తనకూతురిని నరసింహులుకిచ్చి వివాహం చేశాడు, ఇల్లరికం స్వీకరించాడు

నరసింహులు బారంఅధికమైంది ఇల్లరికం అధనపు బాధ్యతల వ్యాపస్తై

అవి మనిషిని మంత్రముగ్ధుని చేసి యంత్రంలా పనిచేయిస్తుంది పైగామధ్య రకం సంసారాల్లో దినదిన గండంటీర్ఘాయుష్షు, కష్టపడితేనే కానిఫలం. ఇల్లరికం అన్నమాటేకాని, అదేగోనెసంచి, అనేగ్రామాలు తిరగటం, నిద్రాహారాలు తక్కువ నూనూగు మీసాలనూత్న యౌవ్వనం, పైగా క్రొత్తభార్య, అయినా మాట్లాడేతీరిక లేనంతపని నరసింహులుఢీశాలి కాబట్టి జంకలేదు. విధికితలవంచ లేదు.

గోనసంచి వ్యాపారం గోపల్లభునిపైకి వచ్చింది వృషభరాజంపై బస్తాలువేసుకొని సంతలు తిరిగాడు, కొడంగలు చేరువలో నందారం అనేగ్రామం ఉంది ఆఊరు ఈతనికి నచ్చింది "ఋణానుబంధ రూపేణ పతిపత్నిసుతాలయః" అంటారు గదా పెద్దలు ప్రాప్తంఉన్నచోట మానవుడు ఉంటాడు ఆగ్రామానికి బసమార్చుకొన్నాడు చిన్నఇల్లుకట్టు కొన్నాడు కొంత ఆస్థికూడా సంపాదించాడు. వ్యవసాయం రెండోవృత్తిగాస్వీకరించాడు అక్కడేస్థిర పడిపోయాడు "కృషితోనాస్తి దుర్భిక్షం" కదా. శ్రమకు ఫలితం ఉంటుంది నరసింహులు ఇప్పుడు నందారం నరసింహులుగా మారిపోయాడు

తిప్పయశ్రేష్టిగారు పరమపదించారని వార్త వినగానే స్థంభించి పోయాడు నరసింహులు. ఆయనగారు ప్రోత్సాహమిస్తేనే తానుపెరిగాడు. కోడంగల్ వెళ్ళిదహన సంస్కార కార్యక్రమాలు తీర్చుకొని తిరిగివచ్చాడు బాధతో అత్త ఒక్కతే ఆగ్రామంలో ఉండెది కాలంసాగుతుంది పట్టింది బంగారంలా వ్యాపారం దినాదినాభివృద్ధి నందింది సెట్టిశ్రేష్టిగా మారిపోయాడు నలుగురు నందారం నరసింహులు పేరుచెప్పుకో సాగేరు. జీవితంలో ఆరోహణ అవరోహణలు పరిపాటికదా

బీదతనం సంపన్నాంధుల కంజనంబు అంటారు. అయినా ఆటుపోటులను చూచినవాడు నరసింహులు అందుకే సంపన్నత ఆయనలో గర్వాన్ని కలిగించ లేకపోయింది. నడుమంత్రపు సిరికి నిక్కుడు నీల్గుడు, విఱ్ఱవీగుడు ఉంటాయట కాని అర్థిక పరిస్థితి మెరుగైనా అతనిలో అహంకారం మాత్రం పెరగలేదు. వాటి స్థానే భక్తి, దయాదాక్షిణ్యాలు చోటుచేసు కొన్నాయి

అతడికి చిన్నప్పటి నుండి వేంకటేశ్వరు డంటేభక్తి, నెలనెలా తిరుపతి వెళ్ళేవాడు. నలుగురు కొడుకులు కలిగారు పెద్దతను ప్రస్తుత శాసనసభ్యుడు రెండోవాడు దివ్యజ్ఞాన మార్గాముడు మూడవవాడు వ్యాపారమునందు నేర్పరి. నాల్గవవాడు చదవరి వీరేకాక ఇద్దరు కూతుళ్ళు కూడా కలిగారు వీరంతా అవిభక్త కుటుంబీకులుగా, అన్యోన్య ప్రేమానురాగాలతో జీవయాత్ర సాగిస్తున్నారు.

అత్తగారి కోరిక, దానికి తగినట్లుగా ఇంట్లో దొంగతనం రెండుయేక కాలంగా రావటంమూలాన కోడంగలు [illegible] మార్చవలసి వచ్చింది. కోడంగల్‌లో తన వ్యాపారాన్ని విస్తృత పరిచాడు బియ్యపుమిల్లు, పిండిమరలు, వ్యవసాయము అనాడు బాగారాజించాయి ఆతడు నేర్పుతో బాగాగడించాడు. సంపన్నుడైనాడు

ద్రవ్యముతో బాటు స్వామిభక్తి, కూడా పెరుగసాగింది.



"స్వర్గాలున్నపని అనేవి మతలుము
తిరిగి పుట్టకపోవుట యే ముక్తి అదే ధర్మము"

# క్షేత్ర నిర్మాణము

జీవన సాంగ్రామంలో బాణంవలె దూసుకపోయి, యేప్రలోభాలకు లోనుకాని జీవితాలవల్ల లోకోప కార్యములు అనేకంగా జరుగుతాయి. నరసింహులు జీవితం రెండురకాలు అధోస్థాయినుండి పైస్థాయి చెరుకొన్నతీరు, రెండోది భగవద్భక్తి, దయాదాక్షిణ్యత

ఒకనాడు వేకువజామున కలవచ్చింది స్వప్నంలో ఆపద్బాంధవుడు, శేషాచల వాసుడు, ఊర్ధ్వపుండ్రములతో దర్శనమిచ్చాడు నేను నీగ్రామం వస్తాను వాసమేర్పరచ మన్నాడు మేల్కొని తానుగాంచిన స్వప్నానికి రూప కల్పనచెయాలను కొన్నాడు యెవరితో అనలేదు. వ్యాపారంలో కొంతభాగాన్ని కూడబెట్టాడు రహస్యంగా పదెళ్ళు కష్టపడితేగాని ఒకమందిర నిర్మాణానికి పనికివచ్చు డబ్బులుకాలేదు. వెంటనే బంధుమిత్ర కళత్రాదులను పిలిచాడు తన కోరిక ప్రకటించాడు అందరు అంతవన మెక్కడిది అసాధ్య కార్యము అన్నారు అయినా నిష్టాటీవులు తమపట్టుదల పదలరు

ద్వితీయ కుమారుడు గంగయతో ఇంటిముందె మందిరానికి శంకుస్థాపన చేయించాడు, తెనాలినుంచి శిల్పులను రావించాడు కార్యభారం మూడింతలు పెరిగింది. అయినా శ్రీనివాసునిపై భారంవేసి ఆధునిక శిల్పనైపుణ్యంతో వెలుగొందు దేవాలయ నిర్మాణం ప్రారంభించాడు. ఆరునెలల్లో పూర్తిచేశాడు ఒక వైపు లక్ష్మి రెండోవైపు అలవేలుమంగా సమేతుడుగా ఉండాలని యిరువైపులా దేవాలయాలు నిర్మింపజేశాడు.

ధ్వజస్తంభం కావాలి అనేక ప్రాంతాలు తిరిగినను తగినమ్రాను అందలేదు. ఆటవికశాఖ క్రంట్రాక్టరు వెంకటెశ్ అనుకోకుండా కలిశాడు శ్రేట్టిగారి కోరికవిని ధ్వజస్తంభం ఇచ్చాడు దాన్నితీసుక రావటం ప్రయాసే అనుకోనంత సులభంగా దాన్ని చేర్చగలిగాడు. ఈస్ఫూర్తికి ఆ శ్రీనివాసుడే కారణం

అన్ని వసతులు సమకూరినాయి చిన్నగా ఆవీధి బాలాజీనగర్ గా రూపొందింది. వైతరిణి వంటి పుష్కరణి, ధర్మశాలలు విద్యుద్దీపములు,

ప్రహరి, ద్వారము, ముఖద్వారశిల్పము, యెడనెడ దేవతావిగ్రహాలు, తగిన వాహనాలు అన్ని సమకూర్చి కలియుగ వైకుంఠం చేశాడు.

ఈ క్షేత్రానికి ఒక ప్రాశస్త్యంకూడా ఉంది కోడంగల్ నలువైపులా ఆంజనేయస్వామి, శ్రీరాముడు, శివుడు కొద్దిదూరాల్లోనే చాలా ప్రాచీనంగా వేంచెసియున్నారు. పూర్వంనుండి భక్తజనుల కొలవాలమైన నిరంజన మఠ మనే శైవ మఠంకూడా ఉంది శైవసాంప్రదాయంలో ఆపీఠానికి గొప్పప్రశస్తి ఈ నాడు ఆనగరానికి శ్రీవెంకటేశ్వరుడు రావడం మరీ విశిష్టత

భక్తజనసులభుడు, కరుణామయుడు, కలియుగదైవం తానుగావిచ్చేస్తా ననివచ్చాడు ప్రతిష్టా కార్యక్రమం సమీపించింది. శ్రేష్టిగారు తిరుపతివెళ్ళి తిరుపతి ప్రధానార్చకుడైన పెద్దింటి వెంకటరమణ దీక్షితులుగారిని కలిశాడు

ఆయనగారు స్ఫురద్రూపి. అజాను బాహుడు వైదికవర్చస్సు, క్షణం తీరికలేని ప్రధానార్చకుడు. లక్షలు సమకూర్చినా తిరుపతి విడిచిరాడు దీక్షితుల వారు ఆనాడు స్వామివారి అష్టబంధనా కార్యక్రమ యోజనలోనున్నారు శ్రేష్టి తనకోరికను వెల్లడించాడు

"నేనురాలేను నాకుతీరిక లేదన్నాడు" దీక్షితులు.

శ్రేష్టి ఖిన్నవదనంతో, బసచేరుకొన్నాడు తనభక్తిలో యెదోలోపం జరిగిందని కించపడ్డాడు చింతాక్రాంతుడై ఆరాత్రి భావి కార్యక్రమాన్ని యోచిస్తు నిద్రపోలేదు.

తెల్లవారింది శేషాచెలం సుప్రభాతంతో నిండుకొంది. సూర్యోదయం ఆకొండ కొకవింత శోభను వెలాదుస్తుంది. భక్తుల గోవిందనినాదాలు ఆకాన్నం టుతున్నాయి. ఆ ప్రతూష సమయాన ఒక బ్రాహ్మణోత్తంసుడు నరసింహులు బస కేచ్చాడు.

దైవదర్శనానికి నెడుతున్నావాడల్లా ఆగంతకుని చూచి ఆగిపోయాడు.
"నరసింహులుగారు మీరేనా? దీక్షితులవారు రమ్మన్నారు" అన్నాడు వచ్చినయతడు ఆశపెల్లుబికింది వెంటనే పరుగెత్తాడు దీక్షితుల ఇంటికి,

"రావయ్యా నరసింహులు. నేను మీగ్రామం వస్తాను" అన్నాడు.
కృతజ్ఞణి నాజన్మ పావనమైంటీరోజు అనుకొన్నాడు. సంతోషంతో

స్వామి దీక్షితుల కలలోకి వచ్చి నేనువెడుతున్నాను నీవురావాలి అన్నాడట ఆమాటవిన్న నరసింహులు భక్తితో పొంగిపోయాడు తిరుమలేశుని అవ్యాజాను రాగానికి లోన మ్రొక్కుకొన్నాడు ఇద్దరు కలిసి మద్రాసు వెళ్ళారు కావలసిన వస్తువులు కొన్నారు. ముందు యెర్పాట్లకై తాను కోడంగల్ చేరుకొన్నాడు.

వైఖానసాగమన శాస్త్రప్రకారం ప్రతిష్టా కార్యక్రమం రూపొందింప బడింది చకచకా యెర్పాట్లు సాగిపోతున్నాయి. కోడంగల్ పౌరులందరికి తిరుమలేశుడు వస్తున్నాడన్న వార్త వ్యాపించింది చుట్టూరాఉన్న అనేక గ్రామ ప్రజలీనాడు వేంచెశారు భక్తులతో గ్రామంనిండింది గోవింద నామం సర్వత్రా వ్యాపించింది స్వామిని దర్శించటానికి అనేకులువచ్చారు దివ్యక్షేత్రంగా అనాడు అనగరీలలామ కనిపించింది. నీవు వచ్చావు. పూర్తయిందాకా ఉండమన్నాడు దామోధరరావుగారు.

ఉన్నాను అయిదవరోజు అన్నదానం జరిగింది. దీక్షితులవారు వేంచేశారు ఆనాడు తిరుపతిలో అష్టబంధన కార్యం ఆగిపోవడమేకాక స్వామి దర్శనంకూడా ఆగిపోయింది స్వామి కోడంగల్ చేరుకొన్నాడని జనశృతి దివ్యమైన ఈకార్య క్రమం కన్నుల పండువుగాఉంది

నందారం నరసింహులు ధన్యజీవి ఆతని భక్తికిమెచ్చి తిరుమలేశుడు కోడంగల్ దాకా వచ్చాడు. ఈనాడు ఈక్షేత్రం కన్నుల పండువుగాఉంది. గత సంవత్సరం శేషాచలవాసుని శేషాంబరాలు వచ్చాయి, దీక్షితులవారు స్వయంగా తీసుక వచ్చారు. వెంకటేశ్వరుని అంశప్రధానంగా ఉన్నచోటికే ఈశేషవస్త్రాలు వస్తాయని ప్రతీతి

తానుగా శ్రీనివాసుడు వేంచేసిన ఈ దివ్యక్షేత్రాన్ని రూపొందించిన నరసింహులు సప్తంతానంలో దేవాలయ నిర్మాణ మొకటిని తెలిసి దానిని నిర్మించి ధన్యుడైనాడు ప్రజావాహినిచే సంస్తుతి పాత్రుడైనాడు. ★

# క్షేత్ర మహాత్మ్యము

సర్వాంత ర్యామి, కలియుగదేవుడు, ఆపద మ్రొక్కులవాడు శేషాచల వాసుడు, కోడంగల్ వాసుడుకాగానే, తనమహాత్మ్యం ప్రకటించటం ప్రారంభించాడు

సంతతిలేని ఒక రెడ్డి కులస్త్రీకి సంతానప్రాప్తి ప్రసాదించాడు. ఆయమ కొన్ని ఆభారణాలు చేయించిందట.

అనుకొన్న కార్యాలవి నెరవేర్చి నందుకుగాను అనేకులు ధనకనక వస్తువాహానాదులు సమర్పిస్తున్నారు

దేవాలయం చుట్టూముడుపులు కట్టిననారికేళాలు. ప్రతిరోజు నిండు కొంటాయి.

దైవమహాత్మ్యం గురించి అనేకులు అనేకరకాలుగా కధలు చెప్పుకొంటారు కోరికలు తీరినవారు ముడుపులు చెల్లిస్తారు

ప్రతిదినం భజన, సుప్రభాతం, గీతాపారాయణం వివిధార్చనలు, మంగళహారతులు సంవత్సరానికి తిరుపతిలోవలె ఉత్సవాలు, సాగిపోతుంటాయి భక్తలోకసుల భుడుకాబట్టి అందరికి సామాన్యదర్శన మిస్తుంటాడు స్వామి.

ప్రతిరోజు అనేకులు యాత్రికులుగా వస్తుంటారు వారి కోరికలు తీరుతున్నాయని చాలాదూరం వ్యాపించింది వడ్డికాసులవాడు యెక్కడున్నా పదికాలాలపాటు నిలువగల ధనాన్ని సేకరించుకొంటాడు. అనేకులు అనేక విధాలుగా చెప్పుకొంటారు. అజ్ఞాతంగా భక్తులు హుండీలలో పెద్దమొత్తాలనే సమర్పించు కొటున్నారు. కర్నాటాంధ్ర సమైక్యతా చిహ్నంగా ఈతిరుమలేశుడు నిలుచున్నాడు మైసూరురాష్ట్రం రాయిచూరు, గుల్బర్గా, బీదరు జనం చాలామంది ఇక్కడికే రావటం ప్రారంభించారు

ఆపద మ్రొక్కుల వాడెక్కడున్నా అష్టఐశ్వర్య సంపన్నుడై భక్తుల కోరికలు తీరుస్తాడు వారుసంతోషంతో కానుకలు సమర్పిస్తారు. ఈనాలు గేళ్ళలో చాలామంది భక్తులు అనేక వాహనాలు, దేవాలయ నిర్మాణంలో యెదు రౌతున్న అనేక అవసరాలని తీరుస్తున్నారు.



శేషవస్త్రి ఊరేగింపు

శ్రీ వెంకటరమణ దీక్షితులు టి. టి. డి. అర్చకం మిరాసిదారు

శ్రీ యం. శ్రీనివాస భట్టాచార్యులు

శ్రీ యస్. ఎ. కె. సుందరవరద భట్టాచార్యులు

# కార్యక్రమాలు

ప్రతిదినం ఉదయం సుప్రభాతంతో ప్రారంభమై దినమొక రీతిగా ఉత్స వాలుసాగు తుంటాయి. అనేకములైన అర్చనలు నడిపిస్తారు.

మామూలు అర్చనలు కన్నీసులభ మూల్యాలనే ఉంచారు ప్రతిదినం ప్రసాద వితరణ వచ్చిన వారందరికి జరుగుతుంది.

సామాన్య అర్చలనతోబాటు, కుంకుమార్చన, తులసీదళార్చన, మంగళ హారతి, వివిధ అలంకారములతో అర్చనలు అనేకం సాగుతున్నాయి

ఏడాదికి అనేక పర్యాయాలు, హైందవ పర్వదినాలు వచ్చినా, లేక పోయినా ఉత్సవాలు కూడా సాగుతుంటాయి

వచ్చిన యాత్రికులకు చక్కనివసతులు కల్పిస్తారు వివాహాది శుభకార్య క్రమాలకు పదిహేను రూపాయలు చెల్లిస్తేచాలు బోజనం తప్ప మిగతా అన్ని కార్యక్రమాలని దేవాలయం వారే చేస్తారు శ్రేష్టిగారు యెవరు వచ్చినా కడు ఆప్యాయతతో పలకరించి వలసిన సౌకర్యములు కూరుస్తారు.

ఈ క్షేత్రము రాయమూరు హైదరాబాదు బ్రాడ్ గేజీ మార్గానగల తాండూరు స్టెషన్ నుండి 10 మైళ్ళదూరంలో ఉంటుంది హైదరాబాదు కర్నూలు మీటర్ గేజి మార్గాన మహబూబ్‌నగరం నుంచి 37 మైళ్ళపై ఉంటుంది బస్సులు హైదరాబాదు నుండికూడ ఉన్నాయి ప్రయాణీకులకేమి ఇబ్బంది ఉండదు.

ప్రశాంత వాతావరణం పరాత్పరుడు తానుగా వచ్చిన నగరం పరమ పావనులైన కోడంగలు నగర పౌరులు ధన్యులు, ధన్య జీవన్నుడు నందారం నరసింహులు కలియుగ దైవము అందరిని కృపాకరుడై రక్షించి, భక్తుల కోరిక దీదేర్చు చున్నాడు. తన కరుణా రసార్ద్ర దృష్టితో అందరి కోరికలు తీరుస్తున్నాడు చూడ ముచ్చటైన క్షేత్రము ముక్తికి మార్గమై వెలయుచున్నది

భంద విముక్తికి, మోక్షప్రాప్తికి, ఈ క్షేత్రము విరాజమానమై నిలిచినదని చెప్పవచ్చును.

ఒక్కసారి నీవుకూడా దర్శించు బంధవిమోచనము పాపవినాశనము, ఈ బౌతిక వాతావరణము సృష్టించిన అప్రశాంతతకి వినాశకారకమై దివ్యమైన శాంతి, క్రాంతిని ప్రసాదించు ఈ క్షేత్రమును చూచితరింపుము. ★

భక్తలోక మందారుడు, కలియుగదేవుడు, ఆపద్బాంధవుడు తిరుమలేశుడు, శేషాచలవిహారి, లక్ష్మీప్రియుడు, అందరిని చల్లగా చూస్తున్నాడు భవబంధ విదూరుడై పాపవినాశకుడై కోరినవారికి కోరికతీర్చె స్వామిని మన మందరం ఒకసారి దర్శించి పుణ్య మార్జింతుము గాక ఈ క్షేత్రరాజము హైందవధర్మ స్ఫూర్తి కేంద్రమై ముందు తరాలకు మార్గదర్శకమగు గాక నరసింహులు సుఖాలనుభవించుగాక

ఓం తత్సత్

"సేవకైనా సంపాదనకైనా నాలుగు గోడలమధ్య కూచుని ఆవకాశం వీధివాకిట ప్రత్యక్షంకావాలను కొంటె ఏలా? బాణంవలె దూసుకు పోవలసిన జీవన సమరంలో మనను వెతుక్కుంటూ వచ్చేవి ప్రలోభాలు మనము వెతుక్కొంటూ పోవలసినవి సోపాన పంక్తులు.

— మాలతిచందూర్



శ్రీలక్ష్మీ వేంకటేశ్వరాయ నమః

శ్రీపతి నీపదాబ్జముల సేవయొనర్చెద నాయెడంద సం
తాపముదీర, నే వెడలుదారి పురాతన మైనగాని నా
పాపముదాపబోవక, యపారకృపాకలితార్థివౌచు, నా
లోపముదీర్చు భక్తజనలోల, కొడంగలు వెంకటేశ్వరా!

తిరుపతి వీడి ఈ తెలుగు దెశము, నంతయు జూచిపోవగా
దిరుగుచు జేరినావు నిజతేజము మీరగ ఈపురాన మా
తెరవయి, నిల్చినావు, నిజదేవళమందు నినుంగనంగనే
పెరిగె, యెడందలో కవన విద్య కొడంగలు వెంకటేశ్వరా

పదములుకూర్చి సొంపలరు భావము దీర్చి రసప్రపూర్ణమౌ
సదనమునిల్పి చక్కనగుసాహితి మార్గముపైన సాగిపో
ఇది కవనమ్ము కాదనిరి, నింతకు నాముకవిత్వతత్వమే
యెవరును, మెచ్చుకున్న రచియింతు కొడంగలు వెంకటేశ్వరా

దాసరి రాత్రివేళ సరదాలకు భాగవతమ్ములాడ గా
వేసిన రాజవేషమది. పేరుకు రాజు కిరీటమున్న, నే
వ్రాసితి నీదుపేరిడి విరాగమొ, రాగమొ, నేనెరుంగ నా
దోసములన్ని పోనణగద్రోయి కొడంగలు వెంకటేశ్వరా

ఎరగను, నిన్ను మించి గడియించిన వానిని, సాటిరావు నీ
సిరులు, ప్రపంచ భావనమును జేర్చి మెలంగెడి జీవితాలలో
జరిగెడి పాప ఘట్టముల సంపద ముందర, ముక్తికొసమై
మరగిరి భక్తి మార్గముల మాటు కొడంగలు వెంకటేశ్వరా

శతకము గాదు, నా బ్రతుకు సంపదనంతయు కుప్పవోయగా
వెతకితి, నిన్ను జూచుటకు వేడితి గాని ధనాలవాలపై
బ్రతికెడి లోక బాంధవుల భావములో పరదాలలోన నా
వెతవిన బోవు, నే ననుభవింతు కొడంగలు వెంకటేశ్వరా!

బాసలు రావు నాబ్రతుకు బాటలు బీటలు వారిపోయె. నా
యాసలు మోసులెత్తుచు మహాంబుధి గ్రుంకె, తుఫానులెన్నియో
త్రోసెను జీవనావ పది త్రోవల కావల నిన్నుగంటి, ఈ
వేసము జూడుమంచి పుడువేడ, కొడంగలు వెంకటేశ్వరా

దూరము భారమై వయసు తోడుగనిల్వక వృద్ధిజీవినం
దారపు నారసింహుడట దాపుకు రమ్మని బిల్చినంతనే
చేరితి వీపురంబునను జిత్తము రంజిల, భక్తలోక మం
దారుఢ్ఢ వీవు, నా యెదనుదాల్తు కొండంగలు వెంకటేశ్వరా.

ఆమిడిదొడ్డి వంశకలశాబ్ది జనించిన నారసింహు, డే
మేమి యొనర్చెనో తపము లింతకు వాని తపః ప్రభావ సాం
గాత్రిమమునందు నిన్నెలువగల్గె, భవత్పుర సీమ నిల్పి నీ
సేమము జూచుచుండె మదిజేర్చి కొండంగలు వెంకటేశ్వరా

చెట్టుంనెక్క నేర్చితివి చెంచత వెంట, మహోన్నతంబుగా
గట్టున నిల్చినావుగద, కాని ఇదేమి విచిత్రిమయ్యె, ఆ
చెట్టులు పుట్టలన్విడిచి చేరితి వేల? ప్రజాళి మధ్య, ఈ
పట్టణభూమి, దీనజన వంద్య కొండంగలు వెంకటేశ్వరా'

క్రిమిసమరమ్ము జీవితము కేవలస్వార్థము మా పథమ్మ హే
యము యెదలోని భావము, సహాయములేని ప్రయాణమెన్నడుం
దెమలదు, కోరిక ల్మొలచి తీరవు, మీరెను మా పర్నియాస. ఈ
సమయమె మమ్ము నాదుకొని సాగు కొండంగలు వెంకటేశ్వరా

మారెనులోక నీతి, పరమార్గములన్నియు మించిపోయె, మా
కోరిక దీరదాయె. సమకూడక కాలము శూలమయ్యె. యే
దారులు గానరావు, బహుదాపచరించితి, నీయువారస
త్కారము లేగదా కరుణగల్గ కొండంగలు వెంకటేశ్వరా!

వేదములందు వర్ణనకు వేదిక వేసిన దేవదేవుడే
వాదమునందు దాగెనో? వివాదములైన పురాణ గాధలే
జూదమునందు రూపరెనో? జూచితి నీ కలికాలమందు మా
మోదము దీర్పుమయ్య మమ్ముబ్రోచి కొండంగలు వెంకటేశ్వరా

స్వేచ్ఛను బొందె భారతి, విశేషములేమని జెప్పునాడ, నా
స్వేచ్ఛను నమ్ముకొంటి ఫలసిద్ధికి, కాని సుఖమ్ము వమ్మునై
తుచ్ఛత గాంచె నా బ్రతుకు, తోచదు భావిఫలమ్ము, నమ్ము, ఈ
పొచ్చములన్ని పోనణచిబ్రోవు కొండంగలు వెంకటేశ్వరా

పాపము మించిపోవునను బాధలులేవు, నిరాశ చేసదా
రూపము మార్చుచున్నయవి, రోసమురాదు, సుఖమ్ము గోర సం
తాపము హెంన, నా బ్రతుకు దారులునీవి. విహారమేకదా
నాపని, కర్త నే ననచునమ్మ కొండంగలు వెంకటేశ్వరా

గిరులెగబ్రాకి, మేఘముల గెల్చువనావళి దాటి, పంక్తిలో
తిరముగనిల్చి, డబ్బాసగి దేవళమందు చిదంబరంబు లా
తెరలనులేపి. చూచుటకు దీరికలేదిక, బీదవాడ, నో
తిరుపతులనాథ, కోరికలు దీర, కొండంగలు వెంకటేశ్వరా

కాసుకు కాసు జేయుమొనగాడవు, వేయనివానిపైన ఈ-
రోసములేల, మా బ్రతుకు రోజులు కూలి, ధనమ్ము లేకనే
వేసము వేయుచుంటిమి, నవీన యిజాల మజాలమధ్య, నీ
దాసుడ. బ్రోవుమయ్య, నినుదల్తు కొండంగలు వెంకటేశ్వరా

తెలియదు అస్తినాస్తి, మన తెల్వికి గన్పడులోక మంతయుఃఆ
కల, కలికాలదైవమవు, కాగల కార్యములన్ని దీర్పగా
గలుగు విధాతవీవనుచు గాంచుటకై, జనుదెంచినాడ నీ
చెలిమిని గోరి నాయడద జేర్చి కొండంగలు వెంకటేశ్వరా!

లంచము వంచె మా బ్రతుకు లాఘవ మంతయు. చేలనన్నిటిన్
కంచెలు మేయసాగినవి, కాలము మారె వినాయకత్వమే
మంచము వేసికొన్నది, సమాజము దేవుని పేరు జెప్పి దా
సంచన జేయ సాగినది సామి, కొండంగలు వెంకటేశ్వరా

పదవిని పొందగోరిన సిఫారసుగావలె, నీతి హీనులే
పదవులలంకరించిరి, సభాపతులైరి సిరుల్గడించ, తా
రెదలను బండరాలవలె యేర్పడజేసిరి, జీవితాలు చే
బదలయిపోయె, కోరికలబట్టి కొడంగలు వెంకటేశ్వరా!

అందము లోకమంతయును, అంతకుమించిన దెన్నొరెట్లు నీ
యందము, మానవుండు తన యందమెరి గినజాలటండుగ్రి, నీ
యందమెరుంగు గల్గునని యందురుగాని, జాగానకల్పనా
చెందము నందమందుగ్రిసువిచిత్రి కొడంగలు వెంకటేశ్వరా

కంటక యుక్త మౌవిరులగాంచి, విచారము సేయు సొక్కుడీ
కంటక మేలపూలకని, కాని తలంపదు కంటకాలలో
కంటికి నింపౌనర్పగల కమ్మనిపూలు సుమించునంచు, వె
న్వెంటనె పాపపుణ్యమనిపించు, కొడంగలు వెంకటేశ్వరా

ఇతరుల మెప్పునందుటకు, యింగిత మంతయు పూడ్చివేసి మా
స్తుతులెగ బ్రాకు నీవు బహుశూరుడ వింద్రుడవంచు, మానవ
స్కృతులని భట్టువానివలె కూర్తురువెంబడి, మానవుండవి
న్వేతుకుట మానినాడుయువివేకి, కొడంగలు వెంకటేశ్వరా

గిరులెగబ్రాకి, మేఘముల గెల్చువనావళి దాటి, పంక్తిలో
తిరముగనిల్చి, డబ్బొసగి దేవళమందు చిదంబరంబు లా
తెరలనులేపి. చూచుటకు దీరికలేదిక, బీదవాడ, నో
తిరుమలనాథ, కోరికలు దీర, కొడంగలు వెంకటేశ్వరా

కాసుకు కాసు జేయుమొనగాడపు, వేయనివానిపైన ఈ
రోసములేల, మా బ్రతుకు రోజులు ఖాలి, ధనమ్ము లేక నే
వేసము వేయుచుంటిమి, నవీన యిజాల మజాలమధ్య, నీ
దాసుడ, బ్రోవుమయ్య, నినుదల్తు కొడంగలు వెంకటేశ్వరా

తెలియదు అస్తినాస్తి, మన తెల్వికి గన్పడులోక మంతయు—
కల, కలికాలదైవమవు, కాగల కార్యములన్ని దీర్పగా
గలుగు విధాతవీవనుచు గాంచుటకై, జనుదెంచినాడ నీ
చెలిమిని గోరి నాయెడద జేర్చు కొడంగలు వెంకటేశ్వరా!

లంచము వంచె మాబ్రతుకు లాఘవ మంతయు. చేలనన్నిటిన్
కంచెలు మేయసాగినవి, కాలము మారె వినాయకత్వమే
మంచము వేసికొన్నది, సమాజము దేవుని పేరు జెప్పి దా
సంచన జేయ సాగినది సామి, కొడంగలు వెంకటేశ్వరా

పదవిని పొందగోరిన సిఫారసుగావలె, నీతి హీనులే
పదవులలంకరించిరి, సభాపతులైరి సిరుల్గడించ, తా
రెదలను బండరాలవలె యేర్పడజేసిరి, జీవితాలు చే
బదలయిపోయె, కోరికలబట్టి కొడంగలు వెంకటేశ్వరా!

అందము లోకమంతయును, అంతకుమించిన దెన్నొరెట్లు నీ
యందము, మానవుండు తన యందమెరి గినజాలటండ్రు, నీ
యందమెరుంగు గల్గునని యందురుగాని, జాగానకల్పనా
చెందము నందమండ్రుసువిచిత్ర కొడంగలు వెంకటేశ్వరా

కంటక యుక్తమౌవిరులగాంచి, విచారము సేయుచొక్కడీ
కంటక మేలపూలకని, కాని తలంపడు కంటకాలలో
కంటికి నింపౌనర్పగల కమ్మనిపూలు సుమించునంచు, వె
న్వెంటనె పాపపుణ్యమనిపించు, కొడంగలు వెంకటేశ్వరా

ఇతరుల మెప్పునందుటకు, యింగిత మంతయు పూడ్చివేసి మా
స్తుతులెగ బ్రాకు నీవు బహుశూరుడ వింద్రుడవంచు, మానవ
స్కృతులని భట్టువాండవలె కూర్తురువెంబడి, మానవుండని
న్వేతుకుట మానినాడుయువివేకి, కొడంగలు వెంకటేశ్వరా

ఇతరుల జీవితాలను సహింపమహమ్మన, వేర్లు జూపుటే
బ్రతుకని నమ్మినాము, సమభావము లేకయె, శాంతికోసమై
వెతుకుచు దృంతు మందరిని. వేదన కాస్పదమివ్వకుండ, ఈ
గతికి విచారమొందుటయెగాక, కొడంగలు వెంకటేశ్వరా!

తెలియనివాడె వాగగల ధీరుడు, వాగుట మాని మౌనియౌ
తెలిసినవాడు, సంశయము దీర్చుటకిట్లు విచిత్రిమార్గమే
నిలిపితివేల, మానవులు నీ చదరంగపు పావులోయి, మా
టలు నికవేయునేల, నినుడాయ, కొడంగలు వెంకటేశ్వరా!

చిత్తములోన నింపినదిచెత్త, విచారము చేసిమాడగా
యుత్తది నత్తమంబగుచు నున్నది, సుఖంబునున్న. నో
రెత్తి వచింతు మానవుడు, ఇమ్మహి నీదరి జేరకుండనే,
రిత్తగ జచ్చు మాయబడిరేప. కొడంగలు వెంకటేశ్వరా!

రక్షణలేదు మానవుల రాజ్యములోపలనీతికంత. మా
భిక్షుక జీవితాలకిక, వేదనలేగతియయ్యె, నేటికీ
కక్షకు కారణం బెదియొ, గాంచగలేదు, వికారమైనవీ
శిక్షలు, నీవెగూర్చు ఫలసిది, కొడంగలు వెంకటేశ్వరా!

సిరులు లభించినన్మనసుజేరిన కోరిక దీర్చినన్. సదా
వరములు పండినన్ పరుల బాధలు మీరిన, నిన్ను జేరి నీ
దరి పదినారికేశముల దానమొనర్చి మెలంగు భక్తు లే
మెరుగరు, మోసగాండ్రగుటయే, కొడంగలు వెంకటేశ్వరా!

కలిగిన నాడె బంధువులు, కామితమంతయు దీర్చువారలే
విలువకు తగ్గవారు, ప్రభవించె దురాశలు, మానవాళిలో
కలయిక కంతరాలు సమకాలిక భావము, నిట్టి యాత్రలో
మెలుగుదురెందుకయ్య గడిమించి, కొడంగలు వెంకటేశ్వరా!

ఉచ్ఛత నీచతా గుణములుండిన నాడె, సమాజతత్వమే
తుచ్ఛతగాంచె, మూర్ఖతకు తోడుగనున్న, జనాళికంతలో
స్వేచ్ఛలుహెచ్చిపోయె, మనసేమముహోమము జెయుచుండె మా
కిచ్చినధాత్రి సీ గతివహించె, కొడంగలు వెంకటేశ్వరా!

వస్తువుకర్తి, మానవుల భావము వెర్రి, విశాల మార్గమే
సుస్తి, విశుద్ధ వేదికలు సోమరిపోతుల వాసభూమి ఈ
మస్తికి కారణం బడుగ, మాటకుమాట, వివాదరూపులై
కుస్తిక నిల్తురేమిసమకూడ, కొడంగలు వెంకటేశ్వరా!

ఆయతమైన కోరికల నన్నిటి గూరిచి వేడినంతనే
జేయుసమర్థతా గుణము చెల్లును నీకని, నీట్లకాంక్షతో
నాయకు లొత్తురంట, మరి నా యెదలోని నందించు భావమే
మాయె, నిరాశయే విలయు మయ్యె, కొడంగలు వెంకటేశ్వరా!

అంగములన్ని గూర్చితివి యాశయ సిద్ధికి నీ పురాన మా
సంగతి కాడవై మెలగి, సంస్తుతు లొందితి వన్నిచోట్ల నీ
ప్రాంగణమందు భక్తజన పావను సన్దరి సించిమ్రొక్కి కో
రంగనె కోర్కెదీర్తువట రమ్య, కొడంగలు వెంకటేశ్వరా!

హైందవ జాతి నేడధమ మయ్యె, కులీన తబాసె, బ్రాందికే
బందికులైరి జాతియను భావము వారెద లేని వారలై
రందరు, కామితార్థ సమయమ్మున నిన్నని కోరువారలే
యుందురు సామి భక్తులనుచుండుగ్రి. కొడంగలు వెంకటేశ్వరా!

వేదికలెక్కి నాయకులు వైదికధర్మము నీ యుగాని, కా
మోదము గూర్చబోదనుచు మించి వచింతురు, మందిరాలకై
వాదములాడు చుండుగ్రి, తమ సంచకులాగగ, ట్రస్టుబోర్డు సం
పాదనజేసి పన్నదిమిపట్ట కొడంగలు వెంకటేశ్వరా!

ధార్మిక విద్యనేర్వకయె దాటెను బాల్యము లౌకికంబులౌ
ధర్మము లన్ని మించె, వనితామణి మోహము పెంపిమించె, ఈ
కర్మకు తోడుగా నవయుగమ్ము దురాశలు రేపె, వింతయౌ
మార్మిక రూపమిచ్చె దునుమాడ, కొడంగలు వెంకటేశ్వరా!

గుడి బడిగాదు, భక్తులు యకుంఠిత మూర్తులుగారు మందిరం
బడిబడిపోవు మానినులు, భావమునందున హైందవత్వమే
ముడివడలేదు. నాస్తికులు మోహముపెంచి గమించు మార్గమే
విడువరు బేధభావములు పెంచి, కొడంగలు వెంకటేశ్వరా!

ఇరువది యేండ్లకాలము గతించె, యనార్యమధర్మ మార్గమే
పెరిగెను, వాదబేధముల పీల్చిరి జాతిని, నీతి భాగమే
తరిగెను. న్యూనగండమును దాల్చిరి పూర్వులదిట్టిపోసి నే
డెరుగరు స్వాభిమానము లయించె, కొడంగలు వెంకటేశ్వరా!

విలువలు దగ్గె జాతికి నవీన పధాన పరాధి కారమే
గలిగెను హైందవ ప్రజకు, గాంచరు వైదిక దర్మమార్గమే
కలుషిత మన్ననూతన వికారము మీరె, నవీనులంత, బూ
ష్టల దునుమాడ మార్పనిరిబొంగి, కొడంగలు వెంకటేశ్వరా!

బ్రాందియు ద్రాగినన్ జగతి బ్రాహ్మణుడేనట జన్మచేత, యా
గాంధిని విస్మరించినను కాంగ్రెసు వాడట ఖద్దరున్న దా
నెందరి బొందినన్ వనిత లీయిల సాధ్వులె భర్తలున్న, యే
మరిదును సామి మేధ యిటులయ్యె కొడంగలు వెంకటేశ్వరా!

అందరు భక్తులే జగతి యర్చన జేతురు పూలనిన్ను నీ
హైందవ ధాత్రి, గాని యొకడన్నిట నిన్నరసింప బూనుచో
నెందరు నాదుకొందురు మహీస్థలి శక్తివిహీన భక్తిలో
యుందువదేల వంచకుల యొద్ద కొడంగలు వెంకటేశ్వరా!

ఇరువది వత్సరాలు గతియించె పరేంగిత బుద్ధిలోన, మే
మెరుగము రాష్ట్రభక్తి, జనియించిన ధర్మపథానురక్తి ము
ష్కరుల వరాలకై నిలిచి కారులు కూసిరి వైదికత్వమున్
పరులకు దాసులై తిరుగబారి కొడంగలు వెంకటేశ్వరా!

విడిచిరి సర్వసంపదలు, విశ్వము నందలి మూలతత్త్వమే
ర్పడగ వనంబు జొచ్చిరి యపార తపమ్ము లొనర్చి మౌనులై
పుడమికి దివ్యభావ పరిపూర్ణత నిచ్చిరి, దాని నిల్పుకో
వడమును పౌరుషంబడుగు బట్టె కొడంగలు వెంకటేశ్వరా!

మడులను మాన్యమున్నడుగ మాధవ! లౌకికభావయుక్తమౌ
జడుడను నేను మోహమున సంసరణమ్మున మున్గినాడ పా
పుడ భవసాగరాన నను పూర్తిగ ముంపకు శ్రీనివాస! నిం
న్విడువను నన్ను బ్రోవుమని బిల్తు కొడంగలు వెంకటేశ్వరా!

తల గొఱిగించి తీర్థమున, తానములాడి, వడ్డి కా
సులుపడవేసి నెన్నొసట శుద్ధిగనామము దీర్చియేడుకొం
డలకెగబ్రాకి మందిరము డాయగ కోర్కెలు దీర్తువంటగా
కలియుగ దేవదేవుడవు గాన కొడంగలు వెంకటేశ్వరా!

కొండలులేవు తీర్థముల కోనలులేవు వనంబులేదు, నీ
వుండుట చోద్యమై వెలసె, యూరవసించుట నేమికారణం
బుండెనొ, భక్తకోటికిక యుండవు పాపములంచు జేరితో,
నిండగు ప్రేమ తోగొలువనిన్ను, కొడంగలు వెంకటేశ్వరా!

తిరుమణిదీర్చి, ముంగురులు దిద్ది కిరీటముబెట్టి, పట్టుటం
బరములుగట్టి, చిత్రమగు బంగరు భూషణముల్ధరించి, నీ
కరమును రక్షగానిలిపి గాతునటంచభయమ్మొసంగు నో
తిరుమలనాథ! నిన్గొలుతుదేవ! కొడంగలు వెంకటేశ్వరా!

నయమును బాసి లోకము కవినాయకమై హృదయానకాంక్షతో
పయనము సేయగా దొడగె పాపభయంబను మాటవీడి, దా
పిియమును బాసి పేదలను బీల్చుట యే దినచర్య లయ్యె నీ
యభయమె బోవగా వలయునయ్య, కొడంగలు వెంకటేశ్వరా!

ప్రక్కన లక్ష్మి నావలికి పద్మయు సంపద సౌఖ్యమేకమై
చక్కని మందిరమ్ము సరిచాలిన వాడగు ధర్మకర్త, నీ
కెక్కడి దింక బాధ, వసియింపుము భక్తుల పాలి వమై
మొక్కుల నందుమయ్య మముబోవ కొడంగలు వెంకటేశ్వరా।

వాల్మిక మందు డాగి పశుపాలుని గోవుల దుగ్ధమాని నే
కల్మియు లేక, పద్మయను కన్యను గైకొని, కొండలెక్కి, మీ
యాల్మగలందు బేధముల కంకుర మెట్టిదొ? పద్మ యేగె దా
తాల్మిని వాసి నీవనరు దప్పి కొడంగలు వెంకటేశ్వరా!

మటములు, పీఠముల్మడులు మాన్యలుం గుడులన్నియు న్సదా
శటులకు దావలంబగుచు సత్వములేక ప్రచార హీనమై
విటుల విహార భూములుగ పెంపెసలారె మహానుభావ! నీ
వటుగన వేల పావన! మహాత్మ! కొడంగలు వెంకటేశ్వరా!

యెనుబది శాతముంగలిగి నెంతయు తాత్విక సంపద న్మెలం
గిన భువిజూడ మాభరతగేహము, లౌకికమై యశాశ్వతం
బనదగు మార్గముంగొలచి యన్నిట పౌరుష హీనమై సదా
కునికెడి వారి దేవుడనుకొందుర? కొడంగలు వెంకటేశ్వరా!

గడనములేదు, వ్యర్థమగు కర్చులు మావి ప్రభుత్వ సంస్థలే
విడువక మేయుచున్నయవి. పెట్టరు హెందవ ధర్మ వ్యాప్తికిన్
విడిచిరి సంప్రదాయమను పేరును, యోజనలందుకర్చుకే
ముడివడె వారి మానసము పూర్తి కొడంగలు వెంకటేశ్వరా!

నిన్ను వసింప జేయుటన నెమ్మదిగా ధనమబ్బునంచు, మా
యన్నలు దింపినారు యడియాశకు గుళ్ళొనరించి, వారికే
మన్నన లిత్తువీవు నినుమారిచి సంపద గూర్చు వారు నీ
కెన్నడు భక్తులైరి వెలయించి కొడంగలు వెంకటేశ్వరా!

పేదకు పెండ్లి సేయుటకు, పెండ్లి ఋణంబు కుబేరుడివ్వగా
మోదము నంది భక్త జనముల్ కరుణించి ధనమ్ము లాగి, నీ
వాదము నిల్పునప్పుకని, వారికి బంపెదవంట తీరెనే
కాదన నట్టి సీఋణపుగాథ, కొడంగలు వెంకటేశ్వరా!

భృగు వుమహర్షి గర్వపడు రూక్ష ణ నేత్రిమడంచి, లక్ష్మి నీ
తగులము వాసిపోవ సరదాలకు వెంబడి, శ్రీనివాసువై
తగుదని వచ్చి జోస్యమున దారులు పేర్చి వివాహ మాడగా
తగిన వరుండ పైతివవధాన్య కొండంగలు వెంకటేశ్వరా!

పన్నుల ధాటికై నణగ బట్టిన సంపద, నాబెహార సం
పన్నత, రాత్రివేళ బడి వచ్చిన లాభము, నిల్పుమంచు సం
పన్నులు భక్తు లౌదురట వారి ధనమ్మును హుండికెత్తి నీ
మన్ననకై తపింతురట మాన్య కొండంగలు వెంకటేశ్వరా!

కలిగిన వారి దేవుడవు గాకుము పేదలమందిరాలలో
మెలగుము, వారిబాధలు శమింపగ నీవు కృపారసాత్మ మా
చెలిమిని గూర్చుమయ్య మనసిచ్చి దయాకర, పేదవారలే
తలపున నిల్పుకొందురు సతంబు కొండంగలు వెంకటేశ్వరా!

మానిని లక్ష్మి దేవి యవమానము సైచక కోప మూర్తియై
తానె వికుంఠ ముస్వీడిచె, ధార్మిక మూర్తియెగాన, నేడు, ధ
ర్మానకి గ్లాని యేర్పడిన మానిని లందరు చూచు చుందురే
గాని యదుర్కొనన్ బలము గల్గి కొండంగలు వెంకటేశ్వరా!

తాపసి కన్ను నొత్తి తన దాపును వీడిన లక్ష్మితో సహా
కాపుర మెత్తి వాల్మికపు కంధర మందు వసించి, పాలతో
తాపము నాపి, కాపరుల దండన లంది, వరాహమూర్తి తో
మాపు వసింప లేదె గుహమాటు కొండంగలు వెంకటేశ్వరా!

కోరిన కోర్కెలన్ని యెనగూడక, జీవిత మంధ కారమై
మీరె నవాంకుశమ్ములయి మించె జగమ్మున కాల మంతయుఞ
మారెను నామనంబ నువిమానము నెక్కి గమించు సామి! నీ
కూరిమి పొంది భక్తి సమ కూర్తు కొండంగలు వెంకటేశ్వరా!

పాశము వేసి, నీ వెఱుక భామినిగా నన వొంద మారి యా
కాశ నంరేదర్రి కన్యకను గాంచి వివాహము నిశ్చయించి సీ
కోశము నింపగా దనదు గోరి, ఋణంబును దీర్చు మోక్షసం
కాశ! కృపాకరా! జనులగావు కొండంగలు వెంకటేశ్వరా!

ఆగురు శిష్య మార్గముల యందు, పరంపర వేదమార్గ సం
భాగుల దివ్య భావకుల పంచన జేరక, వేదనింద సం
భోగుల మాంస హారులగు మూర్ఖుఃశిష్యులు గాగ జూతు వే
లాగున దుర్రించ కుంఠ సువిలాస కొండంగలు వెంకటేశ్వరా!

పేరుకు హైందవ ప్రజలు పీర్లకు న్యాజులు, వూదుదాన్లు సొం
పారగ నిచ్చు చుందురు కృపాపరుడా నిను గొల్వకుండ, సం
సారము నందు మూఢులయి చత్తురు గాని నెరుంగ లేరు శృ
గారపు నీదు మూర్తి యును గాంచ. కొడంగలు వెంకటేశ్వరా!

ఆర్యులు వ్యష్టి శీలముల నందిరిగాని సమిష్టి శీలమే
వీర్యము లేనిదై నిలిచె పెంచె నసూయ మనైక్య మంతటన్
కార్య విహీనులై ప్రగతి గాంచక నుండిరి హైందవనాళి, నీ
శౌర్యమె మాకు రక్షణనసార కొడంగలు వెంకటేశ్వరా!

ఆయుత మైనతత్వపు మహానుభవమ్ము గడించి పూర్వజా
తీయత మేలు కొల్పగల తేజము పెంచి పటిష్ట తాక్రియం
బాయక నిల్పి చెప్పగల బాహుబలుండను వాడులేక, ఈ
ర్షాయుత మైనదీ ప్రజలశక్తి కొడంగలు వెంకటేశ్వరా!

నిరతము నిన్నుగొల్తు దరణీవర దివ్య విలాస రూపయో
తిరుమలనాధ! నాహృదయ దేవళ మందు వశింపు తండ్రి యే
వరమును కోరబోను నిను పాపవినాశక! దేవదేవ! నా
మురిపె-మూదీర్ప రావలయు ముందు కొడంగలు వెంకటేశ్వరా!

మానవ జీవితంబు సుకుమారము దాన పదార్థ తత్త్వ సం
ధానము సేయగా వలయు ధార్మిక మార్గము వీడ కుండ నే
డా నియమాలు లేవు తన యాశకు చేతులు జాపు నేర్పునే
పూనిరి నేడు నిన్మరిచి పూర్తి కొడంగలు వెంకటేశ్వరా!

వీదికి నొక్క మందిరము బెట్టుట కన్నను, యున్న వాటినే
మోదముతో వ్యవస్థ లనువొందగ దిద్దిన జాలుగాని సం
వాదము లేపుటే మతపు భావములైన నశించు, గుళ్ళ ఈ
ర్ష్యాదులు భక్తులైన జగమందు కొడంగలు వెంకటేశ్వరా!

సమతయు సత్య బావ పరిసాధన జేసి వచించినారు పూ
ర్వము జగమంత బ్రహ్మమయ భావము, భౌతిక వాదమందుగా
నము సుఖశాంతి, దాన భవనాశన మబ్బును గాన తత్త్వ మా
ర్గము శరణంబు లందురు జగాన కొడంగలు వెంకటేశ్వరా!

తెలియదు యస్తినాస్తి మనతెల్వికి గన్పడులోక మంతయుం
గల యనివేదవేద్యులన గల్గిరి వారి పథానురక్తి యై
యిల చరియించు శక్తులు లయించిన జీవిని, నీదు నామమే
దలచెద నన్ను బ్రోవుమని తాల్మి కొడంగలు వెంకటేశ్వరా!

గానుగ యెద్దు వోలె తమ గమ్యము గానక కామ వాంచలం
బూని చరించు ప్రాణియును బోవును మృత్యు ముఖాన వారిపే
రైనను నిల్వ బోదు జగమందు, ధరాధిపు లేగినారు, పూ
రైనను లేక, నిన్మరిచి నంత కొడంగలు వెంకటేశ్వరా!

పెట్టని కోట వంటిద్ది కుబేరుని రీతిగ నారసింహుడే
కట్టిన దేవళంబు, మనగల్గితి వాతని పెట్టు పోత లో
గుట్టను లాగి, నీకుసమ కూడెను సౌఖ్యము లందుకోస మే
గట్టును వీడినావు పురగల్గ కొడంగలు వెంకటేశ్వరా!

నిను సినిమా యొనర్చిరి మనీషులు, వారిమజాలు దీర, నీ
వనువుగ వేషధారివయి యాడెద వేమిటి, డబ్బు కోసమై
మనుజులు జెప్పినట్లుగను, మారుచు నుండిన, గౌరవంబు లే
కనబడ వింక వారి గురి గాకు కొడంగలు వెంకటేశ్వరా!

ధారుణ మీపయోధి గతి దప్పిన నావను తీరమెక్కడో -
దూరము, భారమీ నడక, తోచిన రీతి గమించలేమహం
కారము చేత, పాపములు గాఢతుఫానుల వోలె నిల్చె. నన్
తీరము జేర్చు మయ్య గురితించి కొడంగలు వెంకటేశ్వరా!

భవమను వార్ధిలో మునిగి బంధితునై తిని మొహామందు, సం
భవమగు చుండె వార్ధకము, పాపములే ఒడబానలమ్మ లై
గవయుచు నుండ, నాధృతియు గట్టిదనమ్ము నశించె, లోకబాం
ధవుడవు నన్ను బ్రోవుమని దల్తు కొడంగలు వెంకటేశ్వరా!

పాలకులైన వారి పరిపాలన లోన మతంబు లేదు, ఈ.
కాలము వారి కీమతము కాంక్షలు దీర్పవు, రాజకీయమే
మేలని హైందవప్రజలు మించిరి ధర్మము త్రోసి పుచ్చి నీ
వేల సహించితో దెలుప వేల కొడంగలు వెంకటేశ్వరా!

మత రహితంబు రాజ్యము, యమానుషులైరి జనమ్ము. ధర్మమే
హతమగు చుండె, మావిలువలన్ని లయించె, దురాగతమ్ము లే
హితమయి పోయె, మానవుడు యింగిత శూన్యుడు గా మెలంగె. స
మ్మతమగు దారి వీడుచును, మాన్య కొడంగలు వెంకటేశ్వరా!

సృష్టి కి మూలమేది? మనుజుండను వాడు యెవండు? మోక్ష మీ
వ్యష్టికి నందునా? ఇహమునందు సమిష్టికి శక్తి యెంత? ఈ
కష్టము లెట్లు వచ్చును? ప్రగల్భము లాడిన నష్టమేమి? నా
యిష్టము లెంత? చిక్కు విలయింపు కొడంగలు వెంకటేశ్వరా!

చరితలు మార్చి నమ్మనటు సంగతు లన్నియు దూర్చి, వైదికో
త్తరమగు వాదముల్దుడిచి, ధార్మిక వాదము కప్పిపుచ్చి. మా
ర్చిరి పరవారు, మాబ్రతుకు శిక్షణ వారి పథానసాగి ని
న్మరుచుట మార్గమై విలిచె మాన్య! కొండంగలు వెంకటేశ్వరా!

పదవులగోరి నీకు నుతిబట్టి నటించి పలమ్ములంద గా
సదయత కొండలెక్కి ఎనసారగ భక్తుల వోలె వారు దా
మెదలుట చోద్యమయ్యె వినుమించిరి లోకులు, వారిబోధ్రవగా
గదలెద వేల భక్తులిటుగల్గ కొడంగలు వెంకటేశ్వరా!

బ్రతుకును విప్పి జెప్పెదను బాల్యము నందలి స్వేచ్ఛచేత నే
వెతికిన దారులన్ని పరివేదనకే నిలయమ్ము లయ్యె నా
మతినుడి కించి నాకు పర మార్గము లే రుచియించె నేడు నా
గతి చెడిపోయె నన్గరుణగాంచు కొడంగలు వెంకటేశ్వరా!

మేలిమి వీడి క్రౌర్యతకు మేడలుగట్టి, దురాశలో క్రియా
శీలత బాసి హైందవులు చేరిరి మోహ పథాన, చూడరీ
కాలము మారు చుండ, మడిగట్టి వసింతురు మందిరాల లో
లీలగ వ్యాప్త మౌపదను లేవు కొడంగలు వెంకటేశ్వరా!

వరునకు కట్నభావము, వివాహములందున డాంబికంబు, సం
బరపడి చేయు కర్చులు, యపారము, కన్యల తల్లి దండ్రులే
భరువును మోయగావలయు బాధలనొందుచు, పూర్వ పద్ధతుల్
దురుసుగ మారి పోయినటు దోచె కొడంగలు వెంకటేశ్వరా!

సడలవు కట్టు బాట్లు మన సంఘము జేరిన వారి మెచ్చరీ
యెడ మనసిచ్చి వారిని గ్రహించి, మతంబును వీడిపోవ యే
యడదయు బాధనొందదు, సహాయము సేయరు, పేదవారు దా
గడవక జాతి మార్చినను గాని కొడంగలు వెంకటేశ్వరా!

ఇంత జడత్వ మేల సమయించెను జాతికి, సత్వహీన వే
దాంతము నిండి పోయినది యప్పట, వేదిక లెక్కి మాటతో
దొంతులు పేర్తు రేల. తమ దోషము దాచి, విచార బావ మా
వంతయు లేక యుండి మనవారు, కొడంగలు వెంకటేశ్వరా!

పూలకు రంగులద్ది, శిశు పోషణకై యెద పాలునింపి బృం
గాలకు తేనెలల్లుచు. మృగాలకు పచ్చిక బీళ్ళు నించి, లో
కాలను సృష్టి జేయు పరికల్పన లందు శ్రమించు దేవ ఈ
యాలయమందు నిల్చి సుఖమందు కొడంగలు వెంకటేశ్వరా!

అందరివీడి సంసరణ మందు లయించక కానకేగి నా
రెందరో యాశ్రిమాలు రచియించిరి. దానగడించి రాత్మపి
ద్యేందిర నూతగా గొనుచు, నిస్పృహి మాకు నిరాశ తత్వమే
సుందర మంచు జెప్పిరి విశుద్ధ, కొడంగలు వెంకటేశ్వరా!

శక్తిని పెంచు కాంక్ష మనసార వచించె కిరీటి కెంతయో
యుక్తిని ముక్తికిం గలిపి యోగము పేరిడి కృష్ణుడంత, ఈ
వ్యక్తికి ముక్తిగాదు భగవానుని కోరిక దుష్ట శిక్షణే
ముక్తికి గీటురాయి యని పూన్చె కొడంగలు వెంకటేశ్వరా!

క్షుద్రుడు దుర్బలుండగుచు గూర్చును ధార్మిక వాద భేదముల్
నిద్రను గూర్కుచుండి గననీయడు. సోమరి పోతుటీగ యై
భద్రములేని మాటలకు బాటలు వేయును యట్టివాని తో
భద్రత లేదు జాతికిని బాధ కొడంగలు వెంకటేశ్వరా!

సర్వము సత్తుమాయయని శాంతియు దాంతియు గానరాదు తా
గర్వము వీడి చిత్తమున గాంచిన చిత్తది దానివెంట నే
సర్వ సుఖాలు, యాత్మకును శాంతి, యటండుర్రి విరాగ వంతుడే
సర్వమెరుంగ గల్గు బలశాలి కొడంగలు వెంకటేశ్వరా!

పుట్టిన సర్వమున్నమసిపోవును, లౌకిక కర్మమార్గమే
పట్టును పూర్వజన్మపల భాగముగా సమకూడి, పుణ్యమె
ప్పట్టుననున్న మోక్షమను బాటకువచ్చు నదుండికేల, తా
వెట్టులు పుట్టలన్ వెతుకువింత కొడంగలు వెంకటేశ్వరా!

కలియుగ పాలసందర్భమున గల్గు కొడంగలు సీమలోన వె
ల్లులు వెసలాచ్చు మందిర వికుంఠము నందువసించి చేరు భ
క్తుల మొరలాలకించి తులదూగెడివాడవు నారసింహునీ
యిల తరియించె భక్తి వెలయించి కొడంగలు వెంకటేశ్వరా!

బేరములాడు, ధర్మనిరపేక్షణగల్గి చరించు లోభశ్శ్రల
గారము బూనియుండు పని గల్గిన సంస్తుతిసేయు, కామ గం
భీరము లందుమున్గు తన విద్యకు తానె యహంకరించు ఈ
తీరున నేటి మానవుడుదేలు, కొడంగలు వెంకటేశ్వరా!

మానవజన్మ మంతయుకు మాయకు లోనయి మిధ్యనేసదా
గానము చేయుచున్ బ్రతుక గల్గుచు శాశ్వత సత్యమేదియో
గానక చంచలాత్ముడగుగాని నిజమ్ము నెఱింగి నిన్ను దా
మానస మందు నిల్పుకొనమాను కొడంగలు వెంకటేశ్వరా!

మేదిని జాహ్నవీనదిని, మేలిమితో భజియించు భక్త ప్రా
హ్లాదునియందు, రాగితరులందు, హిమాలయమందు, జ్ఞాన మా
ర్గాదులలోన, మార్గశిరమందు, కిరీటి మనంబులోన నీ
వాదిగ నుందునంటివి మహాత్మ కొడంగలు వెంకటేశ్వరా!

దండి మగండవీవు వసుధన్ రచియించుచు నండపిండ బ్ర
హ్మాండము నందునిండుచు జనావళి కోరిక దీర్చుకోసమై
కొండలనెల్చినావు, నినుగోర కొడంగలు జేరినావు మా
యంతకు. ప్రేమమూర్తివి మహాత్మ కొడంగలు వెంకటేశ్వరా!

ఈ సచరా చరంబు రచియించుచు వేద విధానతత్వముల్
భాసిలజేసి మానవుని భావ పరంపరలోని యాత్మవి
న్యాసము జూచుచుండెడి రహస్యపు సాక్షివి, నీవులేనిదే
వేసముసాగదో సకలవేద్య కొడంగలు వెంకటేశ్వరా!

నీ చరణమ్ము లేయెడద నిల్పెద, యెల్లెడ నీదురూపమే
జూచెద, హీనభావముల శుద్ధికి నామ జపంబుచేతనే
లేచేద, నాదు సర్వమును లీన మొనర్తు భవత్పదమ్మునన్
బొంగెడివాడ నీవనుచుపూర్తి, కొడంగలు వెంకటేశ్వరా!

నిజమగు యుక్తి భారతము, నిర్గుణతత్వ ప్రసారవేదమే
నిజమగు దారి, చూడ కమనీయము, భారత జీవితంబు, మా
విజయుని భారతాయనుచు విశ్వ నిగూఢత విప్పినావు నీ
విజయమే రాష్ట్ర భక్తియగపించె కొడంగలు వెంకటేశ్వరా!

సర్వమతంబు లేకమని చాటిన నాటి మతంబు లేవి? యా
దుర్విధి గోరు సాధకుల దోష పథమ్ములు గల్పినావ? యే
నిర్వచనంబు లీ బ్రతుకుపేతకి, దుష్టుల సంహరించుటే
సర్వమనంగలేదె మనసార, కొడంగలు వెంకటేశ్వరా!

అంతము లేని ఈభువన మంతయు నిండిన తత్వరూప వే
దాంతము శక్తికించబదలు హాని యెనర్చెడి సత్వహీనమౌ
దొంతులుపేర్చు చున్నయది, దోషము తత్వము నందు లేదు వే
దాంతులు లోభమూర్తులయిరంత కొడంగలు వెంకటేశ్వరా!

గోపకిశోర! మాధవ! ముకుంద! మురారి! మహాత్మ కామ సం
తాప వినాశ! ఈశ్వర! యుదార! విశుద్ధ విశాలభావ! యో
పాప విదూర! కేశవ! యపార దయామయ! తత్వరూప! నా
పాపము బాపి బ్రోవుము కృపాళు కొడంగలు వెంకటేశ్వరా!

భారత దేశమందు సమభావము నిల్పిన తెన్గురాష్ట్రముం
జేరిన పాలమూరున వసించిన షాద్నగరంబులోని చౌ
డూరున బుట్టినాడ. నొక యొజ్జగ జీవితమీడ్చుచుంటి, ని
న్జేరగ గోరితిన్ గుణపి శేష కొడంగలు వెంకటేశ్వరా!

బాలుడ తత్వశాస్త్రముల భావమెరుంగను, లోక కాంతలో
దేలుచు జీవయాత్రగడ తేర్చుచు సాగెదనిన్నునమ్మ గో
పాలుడ నన్నుభోగ్రవుమిక భావముజేర్చి దయామయుండవై
మేలొనగూర్చు మయ్యనికమీద కొడంగలు వెంకటేశ్వరా!

చదివిన వాడగాను, తగుసాధన జేయగలేదు నేను యే
విదితుని జేరలే దనుభవింపగలేదనుభూతు లేవ్వియుః
మదిగదలించు సీమధుర మంజులమోహన మూర్తిగాంచి నా
హృదయము పల్లవించెను మహాత్మ కొడంగలు వెంకటేశ్వరా!

శతకము వ్రాసి నాబ్రితుకు సంపద విప్పితి, జ్ఞానమార్గమే
గతిగొని పోయెనో దెలియగల్గెడి ధీబలమబ్బలేదు నా
వెతవిను వాడ వీవనుచు పేరిడి వ్రాసితి. తప్పు లొప్పు లే
గతి గమనింతు వో కరుణ గల్గ కొడంగలు వెంకటేశ్వరా!

# మంగళ శాసనం

జయమగు గాక, మా భరత
　　జాతికి, వైదిక తత్వమార్గముల్
నయకుని చేత విశ్వమున
　　నాంతముల్తై ప్రసరించు గాక, ఈ
నియతి విశుద్ధమై ప్రజలు
　　నిర్భయు లౌనటు దిద్దు గాక, నీ
దయకును పాత్రమై సకల
　　ధాత్రి వెలుంగుత, వెంకటేశ్వరా!